శ్రీరస్తు.

# బిల్హణీయము.

పండిపెద్ది. కృష్ణస్వామి ప్రణీతము.





**SCHOLARS' EDITION.**

*(For Private Circulation Only.)*

చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1914.

# పీఠిక.

బిల్హణీయ మను నీప్రబంధము శృంగారరసప్రధానమైనది. ఇది సంస్కృతమునందు నూటయేఁబది శ్లోకంబులందిమిడియున్నది. కాని, తెనుఁగున మూఁడాశ్వాసములమహాప్రబంధమై యెంతయు నొప్పారుచున్నది. ఇతివృత్త సంవిధానముం బట్టి దీనియం దసద్భావము పొడకట్టినను, నాయికానాయకుల యనురాగ ప్రకర్షమత్యంతము హృదయంగమంబుగ వర్ణింపఁబడియుండుటం జేసి, రసికవతంసుల కాదరణీయంబై యున్నయది.

మఱియు నీ యాంధ్రరచన సంస్కృతమునకంటెను రసభావాదిపోషణంబున మఱింత వన్నె కెక్కి యున్నది.

శ్లో. "ఇత్థం చేతసి సంప్రధార్య వికలా సా రాజపుత్రీ కవిం
త్యక్త్వా కాండపటం విహాయ పతితా శయ్యాతలే నిస్స్పృహా,
కన్దర్ప శరసన్తతీర్విసృజతీ ప్రాజల్పదార్తా భృశం
రక్ష త్వం చతురాననేతి తదతః శ్రుత్వా కవీశోఽభ్యధాత్."

అను శ్లోకంబున 'ఇతఁడు నన్ననుగ్రహించునో అనుగ్రహింపఁడో' యని తలపోసి, వ్యాకులతఁజెంది సెజ్జమీఁదఁబడి కందర్ప శరపాతంబులకుఁ దాళఁజాలక, 'చతురాననా రక్షింపు' మనఁగా విని కవివచ్చి పలికె నని యర్థమగుచున్నది.

ఇఁక నీయూంధ్రంబుననో యెంతసారస్యము, ఎంతకల్పనా విశేష పరిపోషము సుగముం బగుచున్నదో చూతుఁడు.

క. "వ్రతభంగమైనఁగాని
మతిమంతు సుదాత్తవేషు మానితవిద్యా
న్వితునిం గాంచెదఁ గన్నుల
కతుల మహోత్సవముగాఁగ నని చెలి ప్రీతిన్.

సీ. విమతవిద్యాజిత ద్విజరాజు ద్విజరాజు
రుచిరాజి నగుమోము రుచులవాని

* * * * * *

సకియ మది నెంచి తమిమించి సంభ్రమించి
కరము లలరించి తెఱవంచి కందళించి
పొంచి తిలకించి పులకించి పొలుపుఁగాంచి
కాంచె రోహిణి చంద్రునిఁ గాంచినట్లు."

ఇవ్విధంబుననె యయ్యయి సందర్భములఁ జమత్కారవిశేషంబులు సహృదయ హృదయాస్వాద్యంబులై విలసిల్లుచున్నవి.

ఈప్రబంధము రచియించిన కవి సింగరాచార్యుఁడు. ఆత్రేయగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. వైష్ణవుఁడు. ఈతనితండ్రి రంగాచార్యుఁడు. ఇతని యింటిపేరు క్రొత్తపల్లివారు. ఈసింగరాచార్యునికి 'చిత్రకవి' యనుబిరుదనామము వచ్చినది. అదిమొదలు వీరిసంతతివారి కందఱికిని, 'చిత్రకవివారు' అను నింటిపేరు ప్రసిద్ధి

కెక్కినది. ఈకవిరచించిన రాఘవవాసుదేవీయాశ్వాసాంత్యగద్యమున—

ఇది శ్రీమదళహసింగరిస్వరూప శ్రీమన్నారాయణముని గురుచరణసేవా సంప్రాప్తకవితా సామ్రాజ్య ధౌరేయాత్రేయ గోత్రపవిత్ర క్రొత్తపల్లి రంగాచార్యపుత్ర చిత్రకవి సింగరాచార్య ప్రణీతంబైన 'రాఘవవాసుదేవీయంబను' అని యున్నది.

ఈబిల్హణీయమును కృతికర్తయనంతరము సత్పుత్రుఁడైన నరసింహాచార్యుఁడు పండిపెద్దికృష్ణస్వామికి గావుకాదులు శ్రీహస్తాదులకువలె నొసంగినాఁడు. చిత్రకవి సింగరాచార్యవిరచితమే యనుటకుం దీని ప్రథమాశ్వాసాంతపద్యము చక్రబంధమున 'సింగరార్యకృతి' యని తెలియుటయు, రాఘవవాసుదేవీయమున—

వ. "అట్టిదేశికోత్తములలో రంగాచార్యులకు కోనమాంబకు సింగరార్య సమాఖ్యుండ నగునే నాదిగ నలుగురముద్భవించితిమి.

* * * * * *

తే. అనెదు నన్ను బుధుల్ గొనియాడి బిలహ,
ణంబు మొదలైనకృతులు విన్నాము తెలుఁగు
నిపుడు భగవత్కథాప్తి నూహించునట్టి
కావ్యము రచించుశ్లేషోక్తి కవులు మెచ్చ."

అను స్పష్టమైనవాక్యములును బ్రమాణములు.

ఈకవికాలము నిర్ణయించుటకు నితని సంతతిలోని నాలుగైదవ తరమువారిప్పుడు కందుకూరు సీమలోని చిత్రకవివారి యగ్రహారమును గ్రామమందును, మఱియు నాప్రాంతములందును నివసించుచున్నారు గావున,నీకవి సుమారు నూటయిఱువది సంవత్సరములకు లోపువాఁడని యూహగలుగుచున్నది.

శ్రీకూర్మము,
గంజాం జిల్లా
1-10-1914

నిష్ఠల. రామజోగి దీక్షితులు.

# విషయసూచిక.

## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.

## తృతీయాశ్వాసము.




# బిల్హణీయము.

---



ప ఁ క.

రామావనిజానిజాయతభుజా
శృంగారశాఖామిళ
త్సారాకారలతా స్తన స్తబకభా
స్వద్దంతవాసరకిసా
లారాళాలకభృంగరంగదఖిలాం
గాంచత్ప్రసూనోత్కర
శ్రీరామాకృతికల్పకంబు మమ్ము ర
క్షించుఁ బుధానంద మై. 1

క. భవసరసిజసంభవముఖ
భువనస్థసమస్తదేవముఖ్యుల కెలమిం
బ్రవిమలమతి మ్రొక్కెద మ
త్కవితకు సంతతము సత్ప్రకాశత గలుగన్. 2.

క. ధర దోషోదకముల నిడి
గరిమఁ సుగుణామృతంబు గాంచుసుకీర్త్యా

కరవరమానసపదసం
చరసత్కవిహంసములను సంస్తుతి సేతున్. 3

తే. నిర్మలావయవమ్ముల నెమ్మి విడిచి
వ్రణములకుఁ బాఱుమక్షికా ప్రతతిభంగి
నొప్పులు గ్రహింప కెప్పుడుఁ దప్పు లరయు
కాకవులలోకముల నే నిరాకరింతు. 4

వ. అని ఇవ్విధంబున నిష్టదేవతానమస్కరణంబును సత్కవి పురస్కరణంబును కుకవితిరస్కరణంబునుం గావించి యే నొక్కనాఁ డెక్కువ యగునుక్కువం జొక్కి హృద్యవిద్యా నవద్యు లగువిద్వద్వాద్యులు గొలువం గొలువుకూటంబున నధి వసించి సముచితగతుల నతుల్యైఖరి దీపించునవసరంబున. 5

తే. చిత్రకవివంశదుగ్ధాబ్ధిశీతభానుఁ
డనుపమానోక్తి శ్రీసింగరార్యసూనుఁ
డమితకవితావిశేషజ్ఞుఁ డనఁగ వెలయు
నారసింహార్యకవి వచ్చి నన్ను మెచ్చి. 6

క. శ్రీపండిపెద్దిసత్కుల, దీపక కాశ్యపసగోత్ర దీవ్యన్మానా
భూపాలక మకుటమణీ, శ్రీపదపాదాగ్రభూమికృష్ణస్వామీ. 7

సీ. కుత్సితకాణాదకుతర్కలకవిభేద
సంసక్తయుక్తివజ్రప్రహార
యుణకాంకపాణినీయాటవీపాటన
చటులసూక్తివిహార పటుకుఠార
నిర్ణీతికృతజైమినీయతూలోద్ధూత
సంస్ఫారవాక్యఝంఝూసమీర

దుర్మతవేదాంతమర్మతమశ్ఛేద
భాసురవచనప్రభావసార
తే. కావ్యనాటకలసదలంకారసాహి
తీసుసంపన్నరసలసద్ధీరహృదయ
పండిపెద్దికులీన సంపన్నిధాన
పాలితకవీంద్ర శ్రీకృష్ణపండితేంద్ర. 8

వ. అని వినుతించి వినుము భవదీయంబు లగుచతుర్దశవిద్యాప్ర
భావంబులు సకలభాషావిశేషంబులు సమస్తచమత్క్రియా
వినోదంబులు నెన్న నిన్నగులకుఁ దరంబుగాదు నిఖిలలోకం
బులఁ గృతిముఖంబుగాఁ గీర్తి నిత్యం బగు నట్టికృతులయందు
నాంధ్రం బతిరమణీయంబు గావున నొక్కపురాతనకథ
నాంధ్రప్రబంధంబుగా రచియించి రామాంకితంబు సేసి
యాచంద్రతారకం బగుసత్కీర్తిం గాంచు మనిన నేనును
సంతోషితాంతరంగుండ నగుచు. 9

క. మున్నింద్రతనూభవునకు
వెన్నుండు సహాయుఁడై నవిధమున నే నా
సన్నుతసద్గుణగణసం
పన్నుం డగుకవివరాధిపసహాయమునన్. 10

షష్ఠ్యంతములు.

క. శ్రీజనకసుతాహృదయస
రోజాతద్యుమణి కజవిరూపాక్షమరు
ద్రాజప్రముఖామర్త్యస
మాజాగ్రణి కరిజనాసుమరుదసిఫణికిన్. 11

క. తుండీంద్రతుండనిభదో
ర్దండస్ఫుటకాండనిర్జితమహోద్దండా
ఖండలరిపుకాండునకుఁ
ఖండపరశుచండకార్ముకవిఖండునకున్. 12

క. సుందరపదారవింద మ
రంద ముదితబుధపురందరమిళిందునకుం
గుంద శరత్కుంద వృష
స్యందనచందనకన ద్యశోగకందునకున్. 13

క. హారితనయాహృదయసారస
హారికి మహాసూనృతజితహారి కతి తేజగ
పరిహాసితహారికి భవగజ
హారికి సదాపాదపంకజానతహారికిన్. 14

క. వరధీనిరస్కృతచక్రాం
గరధికి సౌందర్యహాసితకరరథికి వినమ
చ్ఛరధీకృతశరధికి దా
శరధికి ధృతశరధి కుగగశాస్త్ర వరధికిన్. 15

క. శాంతునకు దాసహృదయని
శాంతునకు నితాంతనయనచాకోరయుగా
క్రాంతమహీజాస్యకళా
కాంతున కానందభరితకపికాంతునకున్. 16

క. రావణహరణునకు జితై
రావణ చంక్రమణునకు ధరారమణునకుఁ
బావనజనభరణునకుఁ
భావనయాభరణునకు నభంగరణునకున్. 17

క. రామునకు నీలమేఘ
శ్యామునకు దివాకరాన్వయాంభోధిసుధా
ధామునకు పరశురామవి
రామునకు సమస్తభూవరలలామునకున్. 18

వ. అంకితంబుగా నాయొనర్పంబూనినబిల్హణోపాఖ్యానం బను
మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 19

---

# ప్ర థ మా శ్వా స ము.

## క థా ప్రా రం భ ము.

### పురవర్ణన.

తే. వసుమతికి నాభిభూత మై వఱలునట్టి
భర్గశిఖరికి నుత్తరభాగమందు
ద్రుపదలలితంబు సుజనసందోహచరిత
దివ్యదేశంబు పాంచాలదేశ మమరు. 20

వ. అందు. 21

శా. శ్రీరామామణి కాటపట్టు హరికిన్ శృంగారవాసంబుఁ జె
ల్వారత్నంబుల కెల్ల నాకరము సమ్యగ్వాహినీపాళి కా
ధారం బన్యదురాసదంబు విబుధత్రాణంబు రాజాస్థిచే
శ్రీరమ్యం బయి సింధురీతిఁ బురి లక్ష్మీమందిరాఖ్యం దగున్.

క. ఆపురము జయశ్రీలకుఁ
గాఁపురము సమంబు ద్వారకాపురమునకున్
భూపురములలోఁ జెల్వగు
గోపురముఖచుంబితైకగోపుర మగుచున్. 23

క. సతతశిర స్థలవిసర ద
దితిసుతతటినీతుషారదీప్తాబ్జము లై
నుతి కెక్కు సౌధరాజము
లతులితశివమూర్తు లనఁగ నప్పురిలోనన్. 24

ఆ. కనకగోపురాగ్ర ఘటితగారుత్మత
రత్నరుచులు కుముదరాజు లేడి
తొడరి మేసవఁ జూచు దూర్వాంకురము లని
చను మృగేంద్రముఖము లునికి నులికి. 25

సీ. ఒకచోటునను బోటు లొకనీటు గొని మీటు
వీణెలనాదంబు వేడ్క సేయ
నొకచెంగట నభంగసకలాంగయుతపుంగ
వమృదంగరవము ధింధిమి యనంగ
నొకవంక గతశంక నకలంకముగఁ బంక
జాస్యలు చెలఁగి లాస్యములు సలుప
నొకచెంత వగఁ గాంత లొగివింతఁ గొని సంత
సము మీఱ సరసగీతములఁ బాడ

తే. వెలయు బహువిధవాద్యసంవేద్యహృద్య
ఘుమఘుమార్భటి దిక్కులఁ గొమరు మిగుల
జనుల కానందరసము నిచ్చలు ఘటించు
రంజితావనిజాని యారాజధాని. 26

సీ. సురసాలసంతతి సురసాలసంతతి
గతి ఖగాళికి ఫలోన్నతి యొసంగు
మహితకాంచనములు మహితకాంచనముల
పోలిక నామోదములు ఘటించుఁ

గలితపున్నాగముల్ కలితపున్నాగము
లట్లకొమ్మలతోడ నమరియుండు
రంభాదినటనము రంభాదినటనము
కరణిమరుత్ప్రసంగములఁ బొదలుఁ
తే. బనస లెంతయుఁ బనసలభాతి ద్విజుల
కును బదక్రమసంయుక్తిఁ గొమరు మీఱు
నగము లున్నతి నగములపగిది వనుల
నలరు చుండు విపత్త్రంబు లగుచుఁ బురిని. 27

క. ఆవనములు ద్విజసందో
హావనములు తులితవృత్రహావనములు స
త్సేవనములు మార్గికసం
జీవనములు చరితభువనజీవనము లగున్. 28

మ. కులసంరక్షణులుఁ సువాక్సుమహితుల్ గోత్రాహితుల్ జా
తవేదులు ధర్మాత్ములు భాసురాఖ్యభువనాప్తుల్ సజ్జగజ్జీవను
లుఁ లలితార్థప్రదు లార్జితార్యులుకసత్కాంతుల్ తమోదూరుల
య్యలధాత్రీసురులెంతయుఁ విబుధులై యింపొందుటల్ చిత్రమే.

సీ. చక్రములకుఁ గీడు సలుపనిరాజులు
దివిరి సత్త్వముల ఛేదింపనియిను
లిలఁ గుభృత్తులకు వెన్నిని కూర్మిపతులు
గోత్రవర్గము బల్మిఁ గూల్ప నింద్రు
లరికి మార్గాగము గానట్టిపూరుషసింహు
లనయంబు మూల నుండనిమహేశు
లాకనిదాపునఁ జేర నోపనిశ్రీదులు
పుణ్యాంబు దప్పనిపుణ్యజనులు

తే. నార వీరస వీరసన్మైకపరులు
పరఁగుదురు పురి శుచిభానువంశ్యు లగుటఁ
గువలయానందసంధాయిగుణతమోప
సరణనైపుణ్యవిభులు రాజన్యవిభులు. 30

మ. ఒకశంఖంబునఁబొంగు నర్థపతియుద్యోగంబుదాము౯ భజిం
పక రత్నాకరుతోడిసఖ్యమునకుం బాటించి సంఖ్యాధిక
ప్రకటార్థాఢ్యతచేఁ జెలంగి బహుమిత్రప్రాభవా సిద్ధమా
పకసంపద్విభవంబుఁ గాంతురుపురి౯ వైశ్యోత్తముల్ వేడుకన్.

క. [1]హాలపాణి యొక్కయేరుం
గలవాఁడని తెల్లఁజేసి కడువేడ్కఁ బురిం
గలవిష్ణుపాదజావళి
యలరారె సువర్ణయుక్తి వ్యవసాయమునన్. 32

చ. సరసిజబాంధవుండు ముకుచాయు ననూరుఁడు తేరుదోలను
స్థిరతరతన్నిబద్ధఖరజిహ్మగపాశము లోలి వ్రేలన
ప్పురికరు లబ్జనాళముల పోలుని తుండములెత్త దక్షిణో
త్తరములనేఁగుభీతి మొయిఁ దప్పిహాతేజుఁడై రయంబునన్.

చ. వరుస నిజేశు మూలఁ బడవైచినయట్టి మరుత్తురంగము౯
సరిగొనక౯ జవంబు గొని సాఁగిన నాశుగమై సమీరుఁడా
ర్చి రహిని రాఁ దదాకృతి హరించెఁ బదోద్ధతధూళిఁ గప్పి త
త్పురితురగోత్తమంబులు విభూషితసాదిబలోత్కరంబులై.

---

1. క. తనయులవిభవము తండ్రికిఁ
గొనరాదే యనుచుఁ బురిని గోరినధాన్యం
బును హరిపదజులు రాసుల
నొనరించిరి హరిపదంబు నొందఁగ నెందు౯.

చ. [1]సమములుగావు వాజు లని సారథి కుం టని గాలికూఁడు ప
గ్గము లని చక్ర మొంటి దని క్రాలునసంతమణివ్రజప్రభా
వమహితమై ఘనావరణవైఖరితో నంరారురాజితో
త్తమరథరాజి భానునిరథంబు హసించు సదా సమున్గతిన్.

క. [2]కట్టింతురు రుద్రునయిన
దట్టింతురు హరులనైనఁ దలఁగనికడిమిం
గొట్టింతురు యమునైనను
బట్టింతురు రిపులనెల్లభటు లప్పురిలోన్. 36

సీ. తమ్ముల దోషాప్తిఁ గ్రమ్మి మూసినఁబట్టు
నయశీలులను బొట్టనర్చుకొంచుఁత
వసుధ మహాహీనువశత నిల్పినసడి
కలసదావర్తులఁ గ్రాఁచునగడు
భోగి నధోగతిఁ బొందించుపాతకం
బాదిత్యకవులు మే లడఁచుకొందవ
కడుఁ గళానిధిఁ దమోగ్రస్తుఁ జేసినదూరు
ఘనుల నివర్ణతఁ గలుపుకలఁక

---

1 చ. వగరశతాంగబృందము లనంతగతోన్నతులై చరింప దే
వగణము తదృథాగ్రిగతివైభవమొందిన వ్యోమయానముల్
వగచుచు మానముల్ దొరఁగి వర్తిలుచున్నవి నాఁటనుండియుఁ
జగతిని దానఁజేసి కొనసాఁగెను వానివిమాననామముల్.

2 చ. కులిశకఠోరహస్తముల ఘోరమదావళిదంతకాండముల్
బలిమిఁ బెకల్చిఁ గొండలు చలంబున దండిగఁ బిండిసేయ ను
జ్జ్వలలయకాలు రైన గెలువం దగులావరు అప్పురంబునన్
వెలయుదురద్భుతార్భటులు వీరభటుల్ చటులాహవోద్భటుల్.

తే. నలువ తప్పించుకొనియెఁ దన్నగరిసతుల
యలరుపదములు మృదుజంఘ లరిదిపిఱుఁదు
లలఁతినాభులు మెఱుఁగారు లలఘుకుచము
లమరుమోములు వరకుంతలము లమర్చి. 37

సీ. విబుధేంద్రచారముల్ వెలయుట నొకవంక
గీర్వాణపురతరంగిణి యనంగఁ
గమలోదయస్ఫూర్తిఁ గాంచుట నొకవంక
నిర వొందుకలశసాగర మనంగ
రాజహంసవిహారరమణీయతర మౌట
నొకక్రేవ మానసంబో యనంగ
ననిమిషాంచితజీవనాభిరూపం బౌట
నొకచో సుధాపూరమో యనంగ
తే. వెలయు నెంతయుఁ దత్పురవివిధవీథి
కాంతరాళప్రదేశనితాంతఖచిత
నవ్యనవరత్నసోపానభవ్యపార్శ్వ
రాజితం బైనకమలాకరవ్రజంబు. 38

తే. రమణ మీఱులక్ష్మిసుందరమ్ము నేలు
నినుఁడు పాంచాలుఁ డాపురి యెన్నఁ బద్మి
నీమణి కరగతయు నై వినిద్రవృత్తి
నతులితామోద యయ్యె సదాళు లలర. 39

ఉ. కాంచనపద్మరాగశశికాంతమణీగణకల్పితోజ్జ్వలో
దంచితసౌధరాజములు తత్పురి నొప్పుధ్వజాన్వితంబు లై
మించినభీతి పత్త్రయుతమేరుముఖాచలపంక్తు లెంత నే
తెంచె ననంగ భూతిసమదేవపుఁ డైనధరేంద్రుపాలికిన్. 40

—పుష్పలావికావర్ణన.—

సీ. నెత్తమ్ముఁ జూచెద నీవింత వదలించు
నీవింత వదలక నేవిధంబు
నీకులుకుఁజెం డ్లేవి పైకమ్ము దప్పించు
పైకమ్ము దప్పనే చేకొనంగ
నెంత నీకై దండ నిచ్చెదవటె మేలు
కైదండ యిత్తురే కర మెడలక
భావింప రుచియేమొ బంధుజీవం బేది
యీబంధుజీవనం బెందుఁ గలుగు
తే. ననుచు విటులఁ సరసనర్మానుకూల
వచనరచనల మెలఁగుచు వఱలువిటుల
కనుగుణంబుగఁ బలుకుచు ననుదినంబు
వెలయుదురు వీటఁ బుష్పలావికలు ప్రీతి. 41

వ. మఱియు నప్పట్టణంబు మణిఘటితకాంచనఘనావరణంబులు ను, ఘనావరణనివారణపటుపటాంచలానిలకేతనాంచిత సౌధ రాజంబులును, సౌధోపరినిబద్ధముక్తామయశిరోగృహంబులు ను, గృహరాజితమణికవాటంబులును, గవాటవిరచితమరకత మణిశోభావిరాజమానతోరణప్రకాశితద్వారంబులును, ద్వా రోభయపార్శ్వరమ్యరత్నవేదికలును, వేదికాంతరరచితవిద్రు మంబులును, విద్రుమవైదూర్యస్తంభసముదయంబులును, స్తంభసంభృతశాతకుంభకుంభవిలసితమంటపంబులును, మంటపాభ్యంతరసంచరత్సుందరీజనంబులును, జనసందోహ సంపూరితవీథికారాజంబులును, రాజకుమారారూఢసంచరద్గం ధసింధురసైంధవరథనికరంబులును, గరవిన్యస్త వీణావాదన

ప్రవీణగాయకులును, గాయకయుక్తమృదంగతాళాది లాస్యసంరంభవిజృంభమాణరంభాసమానవారకాంతలును, గాంతనిరంతరసురభికుసుమఫలభరితపాదపోద్యానంబులును, నుద్యానాన్తరకనత్కమలకల్హారమరందపానతుందిలమిళింద బృందఝంకారప్రమోదమేదురసారసహంసచక్రాదిజలవిహంగసంకలితసరసులును, సరసమనోహారపరిమళమిళితశీతలపవమానంబులును గలిగి, యమరావతీవిధంబున విబుధగణవిభ్రాజమానంబై, తేజోవతీనగరంబుచందంబున లోహితాశ్వవిలసితంబై, సంయమనీనగరంబుపోలికఁ సమవర్తిరాజితంబై, నైరృతినిలయంబుకైవడిఁ బుణ్యజనోద్దీపితంబై, వరుణమందిరంబురీతి ఘనపుష్పమాలికాభిశోభితంబై, పవనునిగేహంబుభాతి నానాసుగంధబంధురంబై, యలకాపురంబుభాగున ధనదమహితంబై, కైలాసంబులాగున రాజశేఖరరమ్యంబై, కమలగర్భసదనంబుపోలిక మహితభాషాసమన్వితంబై, హరినివాసంబుచాడ్పున నిత్యముక్తానుగమ్యంబై, భోగవతీపుటభేదనంబుతీరున మహాభోగిభాసురంబై, వాహినీపతిచందంబున శరణాగతభూభృజ్జాతంబై, సాకేతరాజధానివడువున రామలక్ష్మణోపశోభితంబై, ద్వారకయందంబునఁ గృష్ణబలభద్రప్రకాశితంబై, హస్తిపురివైఖరి గాంగేయాదిభూషితంబై, యింద్రప్రస్థపురంబు మాడ్కి యనుగతధర్మజాతంబై, వారణాసిచూడ్కిఁ బ్రచండకాలభైరవశూలహస్తరక్షితంబై సిరుల నిరవొందుచుండు. 42

క. ఆజగతి కధీశ్వరుఁడై
రాజిలు మదనాభిరామరాజేంద్రుఁడు జ
న్యాజితబాహాపవిధా
రాజిత సమదోన్నతారిరాడ్గాత్రుం డై. 43

సీ. రమణ లక్ష్మీమందిరమ్ము మేలమ్ముగాఁ
గని సదాళి గుణమ్ముగా గ్రహించి
మధురధర్మముఁ బూని మాధవు లోఁగొని
యలఘుద్విజావళి నాదరించి
దాక్షిణ్యశాలి నొద్దనె నిల్పికొని కళా
నిధిపర్వమున రుచుల్ నింపఁ జేసి
శోభితం బగుమహాసుకృతిభావముఁ గాంచి
వరసత్యరతి మనోహరత మించి
తే. కలనభయదోగ్రమూర్తిసంకల్ప మడఁచి
ఘనసుదృక్పాళికామానకర్త యగుచు
నతనువిఖ్యాతిచే మదనాభిరాముఁ
డలరు నిజనామగరిమ యథార్థముగను. 44

సీ. విసములోపలఁ జిక్కి వెళ్లరానిస్వయంభు
లాలితవాణీవిలాసుఁ జేసె
నొంటికాఁడై దాన మొగుని వేఁడినచిరం
తనమాని మేటిభూధవునిఁ జేసె
నచలాధివాసుని నాదిభిక్షుని సర్వ
మంగళానుభవసంప్రాప్తుఁ జేసె
బహుళార్తిభేదవిభ్రాంతిఁ గుందుకళంకిఁ
దనతోడఁగూడ సత్పతినిఁ జేసె

తే. నెన్న నీగుణ మీధర్మ మెందుఁ గలదె
తగ నయుక్తుల సంయుక్తులుగ నొనర్చు
నితని మదనాభిరామాఖ్య మిడిననలువ
కౌశలంబు గణింప శక్యంబె చూడ. 45

తే. రమ్యగుణశాలి యాభూపురందరుండు
దారగాఁ గొని లీల మందారమాల
ననుదినముఁ గూడి క్రీడల నతిశయిల్లు
చవనిఁ బాలించె బుధనికాయంబు వొగడ. 46

క. ఆయనఘున కుదయించె మ
హాయతగుణజాల బాల యంచితలీలం
దోయజనాయకునాఱవ
సాయక మని భూజనాళి సన్నుతి సేయన్. 47

సీ. సకలంకసంగవాంఛాసక్తి దగ దంచుఁ
గమలారిఁ దొరఁగినకళ యనంగ
మే నెఱుంగనివానిమిత్రత్త్వ మస దని
మకరాంకు వీడ్కొన్నమాయ యనఁగ
నిరవలంబావాసనిరతి కాని దటంచు
సురపథం బెడలినచుక్క యనఁగ
మలినాంతరంగసంబంధ మాఱడి యంచు
మేఘంబు వీడినమెఱుఁ గనంగఁ

తే. జాయలను జెల్వ మైనలేఁబ్రాయమునను
జనుల కల్లారుముద్దుగా ననువుపడుచు
నాటపాటలు సలుపుచు నవని బాల
యామినీపూర్ణతిలకాసమాఖ్య నలరు. 48

వ. ఆకుమారీరత్నంబు దినదినప్రవర్ధమాన యై యున్నెడ. 49

క. [1]మృగమదమున రుచిపుట్టిన
పగిదిని జెఱకునను బండు పండినరీతిం
దగసురభి పసిఁడినొందవిన
పగటున లావనము దనరె బాలామణికిన్. 50

సీ. మహితలావనరూప మధుమధురాలాప
బింబోష్ఠి శ్రీవర్ణబింబకర్ణ
కంజాతదళనేత్ర కాంచననిభగాత్ర
చతురచంపకనాస చారుహాస
పటుసైకతశ్రోణి పల్లవాంచితపాణి
ప్రౌఢసౌభాగ్య సంపన్నయోగ్య
కరికుంభకుచపాళి ఘననీలరోమాళి
కుముదాప్తవదన సత్కుంధరదన
తే. యలరుమరువంపుమొలక కాముజునిచిలుక
కలితకస్తూరతిలక సుగంధఫలక
యామినీపూర్ణతిలక నీలాంచదలక
రాజసముగుల్కు శృంగారరసముఁ జిల్కు. 51

సీ. నలినాక్షికొప్పు కృష్ణత్వంబుఁ బ్రాపించు
నెమ్మోము విధురీతి నివ్వటిల్లు

---

1 క. కుందనములందుఁ బరిమళ
మందినక్రియ మృగమదంబు నందమర రుచుల్
వొందినగతిఁ గుసుమంబున
నందపుఁదావివలెఁ దరుణియావన మలరెన్.

నబ్జాస్యకన్ను లబ్జాలోకత వహించు
నధరంబు మాధవఖ్యాతి నమరు
నలివేణిచనుదోయి యచ్యుతత్వముఁ గాంచుఁ
జేయి పద్మాహితస్థితి భజించు
నగకుచనూఁగా రనంతభూతిఁ జెలంగు
లేఁగౌను శ్రీహరి లీలఁ దాల్చు
తే. నాభికమలాకరత్వం బనంగ నెసఁగుఁ
దనువు హేమాంశుకస్ఫూర్తిఁ దనరు నిట్లు
విష్ణుభావంబు చెలియందు వెలయు చుండు
క్షితిజనంబులు మెచ్చి సంస్తుతులు సేయు. 52

సీ. ఎంతటివానినే నీనాతివదనాబ్జ
మమరఁగా లోఁగొనునద్ది మేమొ?
యేధీరు నెదనైన నీ లేమచూపులు
నాటుమనోజబాణంబు లేమొ?
యెవ్వనిహృదయాళి కీతన్విచన్నుంగవ
సరి నిగ్గుకుసుమగుచ్ఛంబు లేమొ?
యేమహాత్ముని నైన నీతలోదరిమాట
యనువంద నిలుపు రాజాజ్ఞ యేమొ?
తే. ఏఘనునినైన వేఁడించునీశుభాంగి
తనువు బంగారమేమొ? యేధన్యునైన
మరులుఁ జెందించు నిది మరుమాయ యేమొ?
యనుచుఁ జూచినజనములు వినుతి సేయు. 53

వ. ఇట్లు తల్లిదండ్రుల కల్లారుముద్దుగా ముద్దియ యేప్రొద్దుఁ
బ్రొద్దులుపుచ్చునవసరంబున. 54

—— విద్యాభ్యాసము. ——

తే. అక్షరాభ్యాస మొనరింప నసువుపడుచు
స్వరయుతంబుగ వీణాదివాదనములఁ
జెలఁగుగీతప్రబంధవిశేషకలన
గానసైపుణి నేర్చె సంస్కారయుక్తి. 55

సీ. రమణీయతర మైనరామాయంచ మృదుచర
ణాబ్జసంగతిని నాట్యములు సలుపఁ
జెలువమై ముద్దులు గులుకుపల్కులతోడఁ
బెంపుడురాచిల్క పేరు కొనఁగ
రామాయణాదిసద్గ్రంథముల్ వెలయఁగాఁ
బజ్జఁ బుస్తకరాజి పరిఢవిల్లఁ
దాళకాలక్రియోద్గారిమంత్రిస్వర
భేదంబులను బాణి వీణ మెఱయఁ

తే. జెలఁగు చిఱునవ్వు వెన్నెలల్ చిలుకుచుండఁ
గలికి తెలిడాలుచూపులఁ గలయఁ బర్వఁ
బాండిమము దోఁచి భారతిభాతి నాతి
పసిఁడిగద్దియపైఁ బాట పాడుచుండె. 56

క. ఆపాట నవసుధాలహ
రీపటలమనోజ్ఞమాధురీలలితంబై
కోపై వీనులకాపై
యాపై కరవంబుమాడ్కి నాపైఁ దోఁచెన్. 57

వ. అట్టిసమయంబున. 58

క. మదనాభిరామభూపతి
యొదవినసంతోషమున మహోల్లాసముతోఁ
బాదలుచు గానము సేయఁగ
మదవతి నిజపుత్త్రిఁ జూచి మదిఁ జింతించెన్. 59

తే. ఈకులపవిత్ర సురుచిరహేమగాత్ర
చంద్రకళ గద సంగీతజలధి కిపుడు
దీనికిని సర్వవిద్యలుఁ దేటపడఁగఁ
బేర్చి సాహిత్య మొదవఁ జెప్పింతు ననుచు. 60

వ. నిశ్చయించి. 61

తే. కొలువుఁగూటంబునకు వచ్చి కువలయేశుఁ
డమరసింహాసనాసీనుఁ డై ప్రధానుఁ
డగువసంతాఖ్యు రావించి యధికసంభ్ర
మమున మన్నించి పలికె సన్మతి దలిర్ప. 62

క. ఓమంత్రిశిఖామణి యిదె
నాముద్దులకూర్మిపుత్త్రి నయ మరలంగాఁ
గోమలగతి లయపక్షతు
లేమాఱక సరసగాన మింపుగ నేర్చెన్. 63

తే. గానవిద్యకుఁ దగినట్లు కన్య కిపుడు
కావ్యనాటకలసదలంకారభావ
సరససాహిత్య మేర్పడుసరణిఁ గఱపి
ప్రౌఢఁ గావింప వలయు నిరూఢమతిని. 64

వ. అను చున్నసమయంబున సభాసదులు తమలో ని ట్లనిరి.

తే. కలికిపాలిండ్లు మేలిబంగారుగిండ్లు
చానవాల్చూపు లానుమచాపుతూపు

లబలవదనంబు సదనంబు నబ్జరమకు
కాంతముంగురు లమ్మధుకరులసరులు. [యయుర

ఉ. మో మఖిలంబుఁ గన్నుఁగవ ముచ్చటమీఱఁగ వక్షమంత
గామిడిచన్నుదోయి కనుఁగొను సమస్తమునిన్ను చూడఁగా
హేమము తత్తనూవిభవ మీరుచిరాంగికి విద్యచెప్పఁగా
నీమహినెవ్వఁడోపు స్మరియించినమాత్రనెభ్రాంతి పుట్టఁగన్.

వ. అనిన విని వసంతుండు భూకాంతునకి ట్లనియె. 68

క. ఓరాజ సకలశాస్త్రవి
శారదు లీపురమునందుఁ జాలం గల ర
వ్వారి నిటకు రావించి వి
చారింపఁగ వలయు విద్యఁ జదివింపంగన్. 69

చ. అన విని సర్వశాస్త్రములయందు ప్రశస్తకు లైనయార్యులఁ
ఘనమతిఁ బిల్వఁ బంచి నయగౌరవముల్ పచరించి వారల
న్గనుఁగొని పల్కె భూవిభుఁ డనంతగుణోన్నతులార మీర లుం
డిన ఫలమేమి యొక్కటిఘటింపుఁడు మాకన వారల త్తఱిన్.

సీ. తర్కశాస్త్రములందుఁ దత్కల్పనలయందు
భాషింపఁగను మహాభాష్యమందు
శబ్దశాస్త్రములందు సకలతత్త్వములందు
శ్రుత్యంతములయందు శ్రుతులయందుఁ
దత్పదక్రమజటాంతముల నారోహావ
రోహములఁ బురాణరాషియందు
స్మృతివిషయమ్ములఁ జెలఁగుమంత్రగ్రంథ
ములయం దితరశాస్త్రములను మఱియు

తే. ఘనులమై వాదములఁ బ్రసంగములు చేసి
గెలిచి యున్నట్టిమముఁ బ్రసంగించి యెవఁడు
గెలుచు మావంటివార లేకలనఁ గలరు
రాజ్యరఘుపతి మదనాభిరామనృపతి. 71

చ. అన విని వారి కిట్లనియె నాత్మముదంబున భూమిపాలుఁడో
ఘనమతులార మీర లిటఁ గౌశల మేర్పడఁ గావ్యనాటకా
భినయకవిత్వచాతురిమ పెం పఖిలంబుఁ గనంగఁ జేయుఁ డీ
మనసిజరాజపుత్రికిని మత్వరపుత్రికి మంజుగాత్రికిన్. 72

వ. అనిన విని యార్యవర్యు లాభూవరున కిట్లనిరి. 73

క. మేము రసజ్ఞుల మధిపా
కా మయ్య రసజ్ఞు లనఁగఁ గవివరు లే కా
దా మాకుఁ గవిత్వము లే
దీమహిఁ ఛాందసులఁ బొందునే యది తలఁపన్. 74

వ. అది యెట్లం టేని. 75

సీ. శబ్దాపశబ్దవిచారి యైనట్టివా
కరణజ్ఞు జనకునిఁ గాఁ దలంచు
యుక్తివాదములచే నొప్పారుతార్కికు
భ్రాతఁగా బుద్ధి నేర్పడఁ దలంచు
నెఱి నిరాదరవృత్తి నెఱపుమీమాంసకుఁ
గదియంగ మండుని గాఁ దలంచు
నొదిఁగి వైదికనిష్ఠ నుండునధ్యాపకుఁ
గనలి దూరస్థునిఁ గాఁ దలంచు

తే. వివిధముగ నిట్టు లధిప కవిత్వకన్య
కావ్యనాటకలసదలంకారభావ

నవరసాభిజ్ఞ మది నిజనాయకునిఁ గఁ
దలఁచి వరియించుఁ దనుఁ దానె వలపు మించి. 76

వ. అని పలికినవిబుధేంద్రులకు రాజమహేంద్రుం డిట్లనియె. 77

క. వరనాటకకావ్యజ్ఞుఁడు
సరసుఁ డలంకారవేది ఛందోనిపుణుం
డురుసాహిత్యకళానిధి
యరయఁగ నెవ్వఁడు వచింపుఁ డతనిం దెలియన్. 78

తే. అనిన మల్హణబిల్హణు లనఁగఁ గవులు
సరసు లిరువు రలంకారసహితు లందు
బిల్హణుం డనువాఁడు గంభీరుఁ డధిక
తముఁడు కవిరాజనంగ స్తోత్రములు వడసె. 79

పండితులు బిల్హణకవిని వర్ణించుట.

శా. ఆవాచాలత యాకవిత్వసరసం బాప్రౌఢి యారూఢి యా
భావం బాపదశబ్దగౌరవము నాపాండిత్య మాశాస్త్రబో
ధావిర్భావక మాసుధారసవచోవ్యాపార మాప్రజ్ఞ యిం
దేవిద్వద్బలభేదికైనఁ గలదే యెంతేనిఁ జింతించినన్. 80

సీ. ధరణి వస్త్రములలో ధవళాంబరము మేలు
ఋతువులలో సుమాన్వితము మేలు
సుమములలో శరచ్ఛోభిమల్లిక మేలు
విలుకాండ్రలో రతివిభుఁడు మేలు
ఘనసౌరభములలోఁ గస్తూరియును మేలు
కలయ స్త్రములఁ గార్ముకంబు మేలు
తనరువాక్కులలోనఁ దర్కవాక్యము మేలు
సారసముఖులలో శ్యామ మేలు

తే. ప్రాయములలోన మహితయౌవనము మేలు
పరఁగుపదవులలో విష్ణుపదవి మేలు
మహితగీతులలోఁ బంచమములయు మేలు
కవులలో నెల్ల బిల్హణకవియు మేలు. 81

చ. మృగములలోనసింహ మవనీంద్రులలో రఘురామమూర్తి ప
న్నగములలోన శేషుఁడు వనమ్ములలో వల నందనమ్ము దే
వగణములోన శంకరుఁడు వార్ధులలోనఁ బయోబ్ధి యెట్టులో
మిగులఁగవీంద్రసంతతిసి మేటియబిల్హణుఁ డట్లుచూడఁగన్.

వ. అనినవిని వారల బహూకరించి యథాస్థానంబుల కనిచిమంత్రి
వరునితో ని ట్లనియె. 83

రాజు బిల్హణకవినిఁ బిలిపించుట.

ఉ. ఆకవిరాజరాజమణి నాదర మొప్పఁగఁ బిల్వఁ బంపుమా
యాకవితాచమత్కృతివిహారముఁ జూతము మత్కుమారిక
స్తోకముగాఁ గవిత్వవిధిఁ జొప్పడ జేయుఁదమంచుఁబల్కఁగా
నాకడ మంత్రిసజ్జనుల నంచిన వారును బోయి యచ్చటన్.

సీ. ఒకచెంత వేదాంత మూహించి ప్రకటించు
నొకయోర వణిసార మొగి వచించు
నొకచోట వరనాటకకలాపము రచించు
నొకచక్కి ఘనపక్కిఁ క్తిఁ దెలుపు
నొకయోర శృంగారయుతకావ్యములఁ జూపు
నొకసీమ నురుసామ మూని పలుకు
నొకదండ స్వరమండలకలగానముఁ బేర్చు
నొకక్రేవ బహుభావయుక్తి నెఱపు

తే. నొక్కతలమున మీమాంస యొక్కదారి
వ్యాకరణపాఠ మొకదెస నలఘులకుఁ
గాద్యలంకారములఁ గోర్కు లమర నొసఁగు
నట్టిబిల్హణుఁ గాంచిరి హర్ష మొదవ. 85

వ. కాంచి దండప్రణామంబు లాచరించి దీవనలు గైకొని సము
చితాసనంబులం గూర్చుండి కవిశేఖరు నుద్దేశించి. 86

శా. దేవా బిల్హణపండితేంద్ర విను మర్థివ్రాతకల్పద్రుమో
ద్భావుం డామదనాభిరామనృపుఁ డత్యంతానురక్తిం బ్రతీ
క్షావాంఛన్ మిముఁ దోడితెమ్మనుచు నాజ్ఞాపించె విచ్చేయుఁడీ
యీవేళంబనియంచుఁ బల్కఁ బలికె న్హేలాగతిన్ వారితోన్.

ఉ. ఏమిప్రయోజనంబు మము నేమిటికిం బిలువంగఁ బంచె నా
భూమివిభుం డుదాత్తమతి భూరిగుణోన్నతులార తెల్పుఁడీ
మే మట కేఁగుదెంచెదము మీ రన నేమిప్రయోజనంబొ
మా, కేమియెఱుంగవచ్చు మహనీయులు పూజ్యులు గారె
[పండితుల్.

బిల్హణుండు రాజసభకు వెడలి వచ్చుట.

వ. అని పల్కినఁ బ్రమోదాయమానాంతరంగుం డై కవిపుంగ
వుం డమితశిష్యసంఘంబు గొలువ రాజమార్గంబున వచ్చు
నెడ. 89

ఉ. ఆముఖసత్కళావిభవ మాకనుబొమ్మలయంద మావయో
ధామవిలాస మానయనతామరసాతివిశాలపత్ర రే
ఖామహితశ్రుతిద్వయవికస్వరకుండలదీప్తగండపా
లీమధురస్మితప్రభలు లేములు సూచి రుదంచితోన్నతిన్. 90

తే. చూచి తలయూఁచి తత్తనూరోచిరాచి
తీమహిమకు కాత్మ మెచ్చి యెంతే ప్రసూన
బాణబాణవిభిన్నసంభ్రాంతచిత్త
లగుచు నేకాంతములఁ గాంత లతిశయమున. 91

ఉ. ఎవ్వఁడు వీఁడు చక్కఁదనమేమన నెన్నఁడుఁజూడ మెవ్వఁడో
పువ్విలుకాఁడొ యాధనదుపుత్త్రుఁడొ చంద్రుఁడొ యారాజ
యంతుఁడో, యివ్వనితాశిరోమణులహృద్వనముల్ చిగిరిం
పఁ జేయఁగా, జవ్వని యేఁగుదెంచినవసంతుఁడొ చూడఁగ
నాకు నావుడున్. 92

మ. అతివా పువ్విలుకాఁడటం చనియెదీ వజ్రాశుగం బెద్దియం
చితమా నిక్కుశరాస మెద్దిమణితీయుం జింతించు నవ్వారిల
క్షితత త్తచ్ఛుభలాంఛనంబు లుపలక్షీభూతముల్ గావె నా
మతినూహింపఁగవచ్చునోహరితగ న్నానువ్యగూపంబున్.

సీ. రాకాకళాశోభిరాజబింబ మటంచు
వినుతి సేయఁగఁ బోలు వీని మోము
ప్రత్యూషవికసితాబ్జాతపత్త్రము లంచు
వీక్షింపఁ దగు వీనివీక్షణములు
శ్రీకుమారుని హేమసింహాసనం బంచు
వెస నెన్నఁగా నగు వీనియురము
ప్రోన్నమితస్ఫుటోద్యత్కాహిపతి యంచుఁ
బలుకవచ్చును వీని బాహుయుగము
తే. తుంటవిల్కాఁడు ముక్కంటికంటిమంట
నంటునను మున్ను చెడి తమ్మికంటికృపను

మగుడఁ బుడమికి దిగియెనో? తగ నతండు
సకియ గాకున్నఁ గలదె యీచక్కఁదనము? 94

సీ. ఈపురుషోత్తమునెద వసించినపద్మ
కరభాగ్యమే మందుఁ గమలనయన?
యీచతురాస్యుకి నెలమిఁ గాంచినశుభ
వాణిప్రౌఢమఁ జెప్ప వశమె తరుణి?
యీమేటిసర్వజ్ఞు నెనసి యుండినసతి
భూతి యింతింత నఁ బొసఁగ దబల?
యీధామనిధిఁ గూడి యింపొంను సుచ్ఛాయ
పదవి యెంతని చూతుఁ బద్మగంధి?

తే. వినవె యీవనితానవమనసిజాతుఁ
గూడి క్రీడించుతరుణులకోర్కు లెల్ల
సఫల మగు వీనిసంగతి సలుపనట్టి
వెలఁదిజన్మంబు ధారుణి వృథయ కాదె. 95

వ. అని యిట్లు వర్ణింపుచుండ బిల్హణుండు నిజాననసుధాకరప్రభాజాలమ్ములఁ దత్రత్యజననిలోకనసందోహమ్ములు చకోరికాబృందమ్ములు గాఁగ మత్తేభంబుచాడ్పున మందగమనంబున వచ్చి విద్వజ్జనమంత్రిపురోహితామాత్యభృత్యవర్గంబుతోఁ దగురాజేంద్రునివలనఁ బ్రత్యుత్థానాభివందనంబులు గైకొని సముచితాసనంబున నధివసించి యాశీర్వాదపూర్వకంబుగా వేదవేదాంతాదిశాస్త్రంబు లుపన్యసించి ఫలసహితంబుగా మంత్రాక్షత లొసంగి మఱియును. 96

క. కవితాప్రసంగ మెంతయు
నవిరళగతిఁ గొంత సేసి యచ్చట విద్వ

తర్క విదగ్ధులచేత మెచ్చులు
నవనీపతి హర్ష మొంద నందెద వేడ్కన్. 97

క. గురుకవిభాషితయుక్తిన్
సురరాజసభాస్థలంబు చూడ్కిని దద్భూ
వరునిసభాస్థలి విబుధా
కరమై పరమై ప్రమోదకరమై దనరెన్. 98

వ. అప్పుడు. 99

తే. రాజరాజైన సుదనాభిరాముఁ డలరి
తనదు కంఠస్థహారాళిఁ దగ నొసంగి
మఱియు మణిరుచిరాంబరమహితభూష
ణావళు లొసంగి విడిదికి నసిపెఁ గవిని. 100

వ. అపుడు మితజనపరివృతుండై భూవరుండు మంత్రివరులో ని
ట్లనియె. 101

చ. మరుఁడు తనూవిలాసమున మంజులవాక్యవిశేషయుక్తిచా
తురిమగుండు సత్కవులఁ దోయజనేత్ర తలంప వీనిఁ దా
మరసదళేక్షణల్ గనిన మారశరాహతిఁ గ్రాఁగుచుందు రీ
వరకవియొద్ద మత్సుతకు వాంఛితవిద్య లభించు టెట్లొకో? 102

తే. వినుము జగతికి వరకల్పవృక్ష మితఁడు
వీనిలావణ్య మనియెడువిరులగుత్తి
దనరుతారుణ్యవతులచిత్తంబు లనెడు
మధుపములఁ దేఁచి తిరుచు సమ్మతి దలిర్ప. 103

సీ. వీనిమనోహరానూనభావముఁ గాంచి
మే నెఱుంగకపోవు సూనశరుఁడు

వీనిభాసురకళావిర్భూతిఁ గనుఁగొని
మి న్నందు నెప్పుడు తమీవిభుండు
వీనిసౌందర్యాతివిభవంబుఁ బరికించి
రెప్ప వేయక చూచు వృషునిసుతుఁడు
వీనిసౌభాగ్యశోభనవృత్తిఁ గని యుత్త
రాశఁ జెలంగు విత్తేశసూనుఁ
తే. డవుర వీనికి దీఁటైనయతఁడు గలఁడె
వసుధఁ బరికింప సౌపర్వవనితలైనఁ
దోడరి మూర్ఛానుగతిఁ జెందుదురు మనుష్య
కాంత లన నెంత యీతనిఁ గాంచినంత. 104

వ. అని. 105

క. ఈవిధమునఁ బల్కినపతి
కానిబుద్ధేంద్రుఁడు సుమంత్రి యనియెన్ నృపవ
ర్యా విద్యాభ్యాసము చెలి
కేవిధమునఁ బట్టువడుఁ గవీంద్రుఁడు లేమిన్. 106

క. ఇతఁడు వినాగా నెవఁ డీ
క్షితితలమునఁ గవివరుండు నెపుమా యనినన్
మతిమంతుఁడ వీవిధమున
కతి చతురోపాయ మొకటి యాత్మఁ దలఁపుమా. 107

వ. అని నృపాలుండు పల్కిన మంత్రి యి ట్లనియె. 108

క. దేవర వారికిఁ దెలియని
దీవిశ్వమునందు గలదె యిప్పుడు నైనన్
నే వచియించెద వినుమీ
దేవ భవత్కరుణ నాకుఁ దెలిసినయంతన్. 109

మ. ఒకచిత్రవ్రతయుక్తి వీరలకుఁ గల్గో రాజచూడామణీ
సకలంకాత్మభవత్కుమారియును జాత్యంధుఁడు విలోకింపదా
సుకవీంద్రుండునుగుష్ఠగాత్రి యెపుడుం జూడఁడు మదింగోరఁ డిం
దుకు నేమో వచియించుటే యెఱుఁగియుండఁడు మున్న దత్కా-[ర్యమున్.

వ. అని మఱియు నిట్లనియె.

మ. కవిరాజాగ్రణి ఘుట్టుగుడ్డియని యీకంజాక్షికిం జెప్పి యా
కవికిన్ మీసుత కుష్ఠగాత్రి యనివేడ్కం దెల్పియు వ్వారికిన్
భువి నన్యోన్యవిలోకనక్రియలు నేర్పుల్ మీఱఁ గాకుండున
ట్లు విచారించెద నొక్కయుక్తి వినుఁడిట్లున్ రాజదేవర్షభా.

క. ఇరువురనడుమను నొక తెరఁ
దిరముగఁ గట్టించి చదువు దృఢతరమతిఁ జొ
ప్పరయఁగ మనకన్యక నే
మఱకయఁ జదివింత మయ్య మనుజాధీశా. 113

వ. అనిన విని సంతోషితస్వాంతుండై భూకాంతుండు. 114

క. ఓమంత్రి యెంతవాఁడవు!
నీమహిమ నుతింపఁ దరమె!నిర్మలగుణ నీ
వే మంటి వేమి చెప్పితి
వామాటలయట్ల చేఁత యది మేలు గదా. 115

వ. అని యంతఃపురంబుఁ బ్రవేశించి. 116

చ. జలరుహపాణి వారిధరచారుమనోహరవేణిఁ గాంచనో
జ్జ్వలరుచిగాత్రి నీలజలజాతదళాయతనేత్రి నంతిక
స్థలముననున్న దాని సుమసాయకుమానినిఁ బోలునాత్మజన్
నెలకొని కాంచి ముద్దుఁగొని నెమ్మదలిర్పఁగ దండ్రి యిట్లనున్.

—⟶ రాజు తనకొమార్తతో బిల్హణుం డంధుం డని చెప్పుట. ⟵—

క. నాగర్భజలధిరత్నము
నీగో మిాక్షించువాఁడ నీ కెప్పుడు నే
రాగంబున సాహిత్యము
బాగుగఁ జెప్పింతు ననుచుఁ బలికితి నను మిా. 118

క. సంగీతవారిధికి సా
రంగధ్వజరేఖ వగుచు రాజితకవితా
సంగతి లేక చెలంగుట
భంగంబుగదా తలంప భావములోనన్. 119

క. సంగీతవిద్యకెలమిఁ
సంగడి సాహిత్యవిద్య సరిగా రెండుఁ
మంగళవతి కలిగిన యా
రంగు వచింపంగఁ దరమె లావణ్యనిధీ. 120

క. మనపట్టణమున విద్యా
భినయజ్ఞుఁడు గలఁ డొకండు బిల్హణసంజ్ఞుం
డనుకవి జాత్యంధుం డా
తని చెంగటఁ జదువవలయుఁ దత్పరమతి వై. 121

వ. అనిన విని. 122

ఆ. అయ్య నేను జూడ నాకవియొద్దను
జదువు లెల్ల నెటులు చదువుకొందు
నంధకాననంబు నాలోకనము సేయ
నని వ్రతంబు నాకు జనక గలదు. 123

క. అంధకునిఁ బాండురోగిని
బాంధవదూషకుని మంఛుఁ బాపాత్ముని దు

ర్గంధయుతుఁ గుష్టువాని వ
సుంధర దర్శింపరాదు శుభగుణచరితా. 124

వ. అనినం గుమారికారత్నంబునకు జనకుం డిట్లనియె. 125

క. పట్టీ యీలాగందురె?
మెట్టినను విద్య నేర్పు టెంతో భాగోఁ
గట్టిగ మీయిరువురకును
గట్టించెదఁ గాండపటముఁ గనరాకుండన్. 126

వ. అని యొడంబఱిచి మఱునాఁడు సమయోచిత కృత్యంబులు దీర్చి సకలమణిభూషణాంబరభూషితుండై కక్ష్యాంతరంబులు గడచి యెడనెడఁ బుడమిజేజేలదీవనలుఁ గైకొనుచు బహుది ననివసిత దేశాధీశులమనవులు సముచితజనులవలన వినుచుఁ గొందఱుసుందరులు ముందర బారులై కైవారంబులుసేయఁ గొందఱు కంజాతపాణులు మంజులగతి వింజామరలు వీవఁ గొందఱుకీరవాణులు చేరి పరాకులు గావింప నొక్కకస్తూర గంధి కప్పురంపుబాగా లొప్ప మిగుల నందియ్య నందియలు మ్రోయ నొక్కమందయాన యందంబుగా చందనాదు లొసంగ సంగతి నూడిగంపుఁజెలు లిట్లు సముచితప్రకారంబునఁ గొలిచి రా మందగమనంబున వచ్చి వచ్చి రాజిత కమలాకరంబుచందంబున నందం బగుచు రాజ్యలక్ష్మీలక్షితం బైన యాస్థానమంటపంబుఁ జొచ్చి సముచితకాంచనాంబుజమధ్యంబున నధివసించు రాజహంసంబు సొంపునఁ గాంచనసింహాసనంబున రాజహంసుండు విబుధగణపరివృతుండై మహేంద్రుం

డగుచు సదాభువనక్షత్రసమన్వితుం డై కువలయాధీశుం డగు
చు మహాభోగిపరివేష్టితుం డై భూభృద్వ్రతంసుం డగుచు రా
జరాజకుమారసేవితుం డై రాజశేఖరుం డగుచు సముచిత భా
షాసమన్వితుం డై చతురాననుం డగుచు సుమనఃప్రసన్నుం
డై పురుషోత్తముం డగుచు నభంగు లైనవాహినీశులును
నపుణ్యజనబాధకు లైనసుమనోవల్లభులును నప్రమత్తు లైన
శ్రీకరులును నచంచలు లైనమహాబలులును నవనశాలు
లైనప్రచేతసులును ననంతకు లైనసమవర్తులును ననుగ్రహ
సహితు లైన ధనాధిపతులును గొలువఁ గొలు వుండి మంత్రి
వరునితో ని ట్లనియె. 127

తే. ఓవసంతకరూప మహావసంతుఁ
డగుకళానిధిఁ బిలిపింపు మాకరాధి
వాసిముఖి కొప్పఁ బలికితి వాసి మీఱ
ననఁగఁ బిలిపించె గవివరు నాతఁ డపుడు. 128

క. వచ్చినకవివరుఁ గనుఁగొని
విచ్చేయు మటంచు నుచితవిధుల నరేంద్రుం
డచ్చుపడఁ బలిపి కొన్నియు
ముచ్చటలుం గడపి కుతుకమున ని ట్లనియెన్. 129

ఉ. ఓకవిరాజచంద్ర విను మొక్కటిసెప్పెద మత్కుమారి కస్తో
కకళావిశేషములు చొప్పడఁ జెప్పుచు లక్ష్యలక్షణ, శ్లోకకవి
త్వమహాధి కవిలోకము సన్నుతిసేయఁ దెల్పుమా, మాకు గు
రూత్తరుండ వయి మత్కృతసత్కృతిఁ గాంచి వేడుకన్.

—— రాజు బిల్హణునితోఁ దనకూఁతురు కుష్ఠరోగియని చెప్పుట. ——

తే. అయిన నొక్కటి గలదు మదాత్మజాత
కుష్ఠరోగంబునను గొంత కొదవ యయ్యె
వినయమందు మనీషావివేకమందు
గానమందుఁ బ్రవీణ విజ్ఞానహృదయ. 131

వ. అనినఁ గవిశేఖరుం డిట్లనియె. 132

క. ఓహో భాగాయెఁగదా
యూహింపఁగ నెట్లు సెప్ప నోపుదు విద్యా
వ్యాహంబు కుష్ఠగాత్రిని
నాహా వీక్షింప రాదు హరివంశమణీ. 133

వ. అది యెట్లంటేని. 134

క. వ్రత మొకటికలదు మా కిల
శ్రుతిహీనునిఁ గుష్ఠరోగిఁ జూడ నటంచున్
మతి సంశయింప నేటికి
ద్రుతముగ నమ్ముఁ బంపు మయ్య గూఢవిచారా. 135

వ. అనిన విని రాజేంద్రుం డిట్లనియె. 136

క. దానికి నొక్కటి చెప్పెదఁ
గానియెడల్ నడుమఁ బటముఁ గట్టించెద స
న్మానముఁ గైకొని విద్యా
దానము సేయంగవలయు దాక్షిణ్యనిధీ. 137

ఉ. అందుకుబిల్హణుండు వినయంబు నయంబు మనంబునొందరా
జేంద్రునిఁ జూచి పల్కె వసుధేశ్వర మీమన సట్లయుండఁగా
నిందుల కేమియందు భవదీయవచోగతి మీఱ రాదు మే
లొందఁగఁదోఁచినట్ల సతి కొప్పుగఁ జెప్పెద విద్యనేర్పునన్.

వ. అనినవిని స్రగ్గంధకుసుమతాంబూలాదిప్రదానంబులసంతుష్టుం
గావించి పుచ్చి దరహసితవదనుండై యిష్టసఖునితో. 139

తే. నీయుపాయము బాగాయె నీతివేది
యనుచు భూషించి తత్క్షణంబున నిమిత్త
కోవిదులఁ బిల్వఁ బంచి యక్కువలయేశుఁ
డనియె శుభలగ్న మీక్షింపుఁ డనుచుఁ బ్రీతి. 140

వ. ఇట్లు ముహూర్తనిర్ణయంబు సేయించి గృహకారుల రావించి
వివిధవిచిత్రంబుగా విద్యాశాలిక రచియింపం జేసి. 141

విద్యారంభము.

తే. అపుడు మదనాభిరామనృపాగ్రగణ్యుఁ
డతుల మైనట్టిశుభదినమందు హితుల
బాంధవుల మంత్రిహితులనుఁ బండితులను
గవుల రావించి బిల్హణకవినిఁ బిలిచి. 142

క. తనకూర్మితనయ నధిపతి
తనరంగ రావింప వెంటఁ దవిలి సదాళుల్
గని యామోదమునను రా
సనయుంబున వచ్చి పటముచాటున నిలిచెన్. 143

వ. అప్పుడు పురోహితులు పుణ్యాహవాచనంబు లాచరించిన దద
నంతరంబ. 144

తే. మొదలవిఘ్నేశ్వరుని వాణిఁ బూజచేసి
బాలరామాయణమునను బద్య మొకటి
నర్థయుక్తత నారంభ మర్థిఁ గఱపి
ప్రేమఁ జెప్పంగఁ దొడఁగె నాబిల్హణుండు. 145

వ. అప్పు డప్పాడమిఱేఁడు సమ స్తవిద్వజ్జనభూసురాదిబాంధవులకు భోజనంబులు గావించి మణిమయ భూషణవస్త్ర మాల్యాను లేపనతాంబూలాదికృత్యంబులం బరితృప్తులం జేసి మఱియును.

మ. జననాథాగ్రణిపుత్త్రికిం గవికి నిష్టం బొప్పఁగా నిత్యభో
జనతాంబూలము లంచితాంబరములుఁ శయ్యాసన స్రక్సులే
పనముల్ తక్కువగాకయుండనమరింపఁ బిల్హణాఖ్యుండు జ
వ్వనికిం గావ్యము లాది సేసి కఱపింపఁ సాఁగె నానాఁటికిన్.

క. సరసాలంకారమనో
హరకావ్యము లర్థయుక్తిగాఁ జెలు వొప్పం
బరఁగ నుశబ్దవిచారము
వరసాహిత్యంబుఁ దేటపడఁగాఁ దెల్పెన్. 148

తే. జగతిజనములు మెచ్చి యాశ్చర్య మొంద
లలితముగ బిల్హణాఖ్యునివలన సకల
విద్యలు గ్రహించి జలధర వేణి యొప్పె
నంబు ప్రింగినత స్తాంహాంబుకరణి. 149

సీ. వివిధ భావవిశేషనవరసంబులయందుఁ
బ్రీతి నలంకారభేదములను
ఛందోవిభేదలక్షణముల సరనాట
కప్రక్రియల మహాకావ్యములను
గామప్రదము లగుకామశాస్త్రములందు
జ్యోతిషశాస్త్ర సంగీతశాస్త్ర
ముల నభినయకళాకలితమార్గములందు
గణితతత్త్వమరకాండములను

తే. ప్రౌఢ లైయు మించి శ్లోకార్థభావ మెఱిఁగి
సంస్కృతాఖ్యైకభాషాదిచతుర యగుచు
హితము మీఱఁ గవిత్వ మూహింపఁ దొడఁగె
యామినీపూర్ణతిలక వాగతిశయమున. 150

చక్రబంధము.

శా. ధన్యాసింహభచంద్రకీర్తివరవిద్యాపణ్డితార్యక్రమా
గణ్యాగర్వధనంజయాశివదముక్తాకృత్స్నరింక ప్రభా
జన్యారాజితభూరిశాత్రవకుభృజ్జాతిప్రభావిక్రమా
మాన్యారాధనత్యాగభోగజయధామా నవ్యభాగోత్తమా.

మాలిని. కాండ భూభవాసితాంశుకాండ భూభవాదిటా
ట్కాండ భూభవాబ్జసుప్రకాండ కాండ భూనుత
త్కాండ భూభవాపగోర్వికాంట తుండిరాట్సుధా
కాండ పాండుభావిభాస్వఖండకీర్తిసుంటలా. 152

గద్యము. ఇది సీతారామచరణసేవాప్రభావసంపాదితకవితావిచిత్ర కాశ్యపసగోత్ర పవిత్ర శ్రీమత్పుండిపెద్ది కృష్ణస్వామి ప్రణీతం బయినబిల్హణీయోపాఖ్యానం బనుమహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీ ర స్తు.

# బి ల్హ ణీ య ము.

---



## ద్వితీయాశ్వాసము.

మానిత వరరఘుకుల
సోమా సోమాంతరంగ సుసుచిరభవనో
ద్దామ విలాసయశోవర
సీమా మహనీయనామ! సీతారామా. 1

వ. అవధరింపుము తదనంతరంబ. 2

### వసంతకాలవర్ణనము.

చ. అలరె వసంతకాలము పురాంతికసీమ వనాంతపుష్పస
మ్మిళితమరందపానభరమేదురమత్తమధువ్రతాంగనా
కలమృదుగానలోల మతికాంతరసాలవిశాలపల్లవో
జ్జ్వలపికనాదసంచలితచారువియుక్తజనానుఖేల మై. 3

చ. అల మధుమాసవేళ జలజాయతనేత్రలు క్రీడ సల్పుచోఁ
గొలఁకులపజ్జఁ జేరి నవకోమలకాంచనపుష్పజాలముల్
హాలహాలికః గ్రహింపఁగ సదాళులు సీయనిపోసి యేఁగెభూ
తలమునఁగాంచనాపహృతిఁదల్పరుగాసుమనఃప్రవర్తనుల్.

చ. చెలఁగు వసంతభూరమణశేఖరుఁ డోలి మహావనీస్థలిం
గలయుఁగ నేలి పైకమెసగందగఁ గైకొని ముద్రఁ బెట్టుచో
వలనుగ హేమరాశి మధుపాయికిఁ జూపక వైరిజోతులఁ
మలయుహరించుమిత్రువసుమంతునిఁగానొనరించెనాఢ్యుఁ డై.

మ. కమలామోదముసంఘటించిశుకవాక్యంబర్థినాలించి యా
సుమనగకాండము లెల్లబోధముఁ గనఁ శోభిల్లఁగాఁ జేసి ని
త్యమహాభూతిఁ బలాశభేదనకళావ్యాపారి యై మాధవుం
డుమహింగౌరవజాతినేపడఁచియుండఁ సద్ద్విజశ్రేచ్ఛఁగన్. 6

చ. మనసిజచోరకుండు తఱిమాటున ప్రూఁజిగురాకుబాకు చే
కొనిమొయిడాఁచివేగఁ దమిగొల్పి శశింబయిఁ గాఫువెట్టి తా
నెనయుఁగ ధైర్యభిత్తిఁ బెకలిం చెలగాడ్పునుమచ్చుఁజల్లి చ
య్యన హరియించి మించెఁ బ్రమదాంచిత మానధనంబులెంత
[యున్. 7

చ. మరుఁ డనుసోమయాజి వనమధ్యమునందు ద్విజాళిమంత్ర
ములే, కరముఁ బఠింపఁగా శిఖి ప్రకాశిలఁగాంచి మరుద్గణం
బు ల, న్వరుస భజించి రాజునకవార్యశుభోన్నతిఁ జెందఁజే
సె నొ, పరమమతిఁ వియుక్తపశుబంధము మాధవుఁ బ్రీతి
[సేయుచున్. 8

సీ. మాకందములనీడ మాకందములు చూడఁ
జేకొమ్మ యోకొమ్మ చిగురుఁగొమ్మ
గోరంట డాయవే గోరంట రాయవే
యీచాయ నేచాయ నింపుఁజేయఁ
దిలకంబు మానినీతిలకంబ పూని నీ
చేయూన నీయూన చెలఁగుఁ గాన

పున్నాగముల క్రిందఁ బున్నాగములఁ జెంద
నాసొంపు రతిపెంపు నందగింపు
తే. నిట్లు ప్రమదలు సఖులతో నెనసి మనసి
జాతదీపితహృదయలై సంతసమున
సరసవనకేళికామహోత్సవము లలర
వెలయుచుందురు మధుమాసవేళలందు. 9

సీ. ఘనరసాలంబుఁ గైకొనియెఁ గోకిలవాణి
పదరి పోఁ బోకువే పల్లవోష్ఠి
యనుపమసరసిఁ దానాఁగెఁ జక్రస్తని
మే లని కదియకే మీననేత్రి
చిగురించుబలుకొమ్మఁ జెందెఁ గుంజరయాన
చేరఁ జూడకువె రంభోరుయుగళి
కదళికాతరు వందెఁ గస్తూరివరగంధి
కూడకే లికుచవక్షోజకుంభ
తే. యనుచు నొకబోటి యదలింప నతివ గొనద
రామలార చంద్రాస్యలార హరిమధ్య
లార సురభిళనిశ్వాసలార పలుకు
మానుఁ దపియించు దిగులొందు మాయుననియు. 10

సీ. బింబోష్ఠి చిలుకలఁ బిలిచి ముద్దాడంగ
సాంకవగంధి మెచ్చకయుఁ గసరె
జలరుహాచరణ హంసల గారవింపంగ
ఘనవేణి రొప్పుచుఁ గడకు నొత్తెఁ
కుసుమాంగి యళులఁ జేకొని తేనె లియ్యంగఁ
గాంచననాసి తప్పించి తఱిమెఁ

గిసలయపాణి కోకిలములఁ బలికింప
రామాభిరామ సూరకయ యనిపెఁ
తే. బలుకులను మానముల ముంగురులను గీత
ములను లేఁదోఁట నవయుచు వెలఁదు లిట్లు
మాననిబలములఁ గొందఱు నగులు గొలుపఁ
గొంద ఱవి చూచి నిరసింతు రంద మలర. 11

వ. మఱియును. 12

సీ. కలికి చిల్కలకొల్కి ఫలములఁ గోయవే
కోకిలవాణి చిగుళ్లు దేవె
దీటుగా నలివేణి తేనియల్ గూర్పవే
పావనచరిత పుష్పములు దేవె
కలహంసగమన మేల్ జల్లము లానించవే
చంద్రానన సుధారసంబుఁ దేవె
పాటలాధర వేగ వీటి ఘటింపవే
భర్గోపమాంగి దీపంబు దేవె
తే. యనుచుఁ దమలోనఁ జెలులు సయ్యాటములను
సరసవనకేళికామహోత్సవము మెఱసి
యసమశరదేవుఁ బూజింతు రంద మలర
సారమధువేళఁ గాసారతీరములను. 13

తే. ప్రకటితాగమవాసనాప్రథితము లయి
విమలకాసారగౌరవవిభవ మంది
లలిత మైనవసంతకాలమునఁ గాన
నములు చెలువొందు నాకాననములకరణి. 14

మ. సకియాకొమ్మలు పల్లవావళులతో సయ్యాటముల్ సల్పహా
లికుచంబుల్ ఫలసంగతిఁ వెలయునాలీలాగతుల్ గంటి వే
సకియా కొమ్మలు పల్లవావళులతో సయ్యాటముల్ సల్పహా
లికుచంబుల్ఫలసంగతిన్వెలయుట ల్చిత్రంబెయూహింపఁగన్.

ఉ. రాగముతో సదాళి తనరం బొదిసేయఁగ నీలతాంగి పు
న్నాగముఁగౌఁగిలించిసుమనస్స్థితినున్నదిచూడుమన్నహా
రాగముతో సదాళి తనరం బొదిసేయఁగ నీలతాంగి పు
న్నాగముఁ గౌఁగిలించి సుమనస్స్థితి నుండుట చిత్రమే చెలీ.

సీ. చిగురాకు లవి యేల చీల్చెదరే వన
ప్రియచయాశాప్తి హరింప రాదు
బిసకాండముల నేల విఱిచెదరే హంస
జీవనచ్ఛేదంబుఁ జేయ రాదు
మకరందముల నేల మాల్పెదగే సదా
ళినిరాకరణవృత్తిఁ బెనుప రాదు
కువలయంబుల నేలఁ గూల్చెదరే ద్విజ
రాజసంప్రీతి నార్పంగ రాదు

తే. అనుచుఁ గొందఱు సుందరు లంద మలర
వనుల సరసులఁ గ్రీడించు చనుదినంబు
సరసవాక్ప్రౌఢిఁ జూపుచుఁ జతుర లగుచు
వెలయు చుందురు మధుమాసవేళలందు. 17

వ. మఱియు నవ్వసంతసమయంబునం గాంత లింతిం తనరాని నంతసంబుల సంతతతంతన్యమానతరుసంతాననితాంతకాంతంబు లగులతాంతంబుల నిరంతరపరిమళవంతంబు లగుట బంతులు గొను తేఁటులరంతులకు నలంతఁ గొనుచింతల

నత్యంత సుమరసదంతురాంతరంబు లగుకనకవనాంతరంబుల కరిగి తదంతరంబుల వంతులు మీఱి సేవంతులు గోయుచుఁ బూబంతులు గట్టుచు నెంతయు వింత లగు కంతునిచికిలికుంతంబు లన మంతు కెక్కు శశికాంతరుచుల వింతఁగొనిదొంతర లగుకలికాసంతతుల కాంతిమంతంబులై ప్రాంతంబుల నలరువాసంతికాదంతనిశాంతంబుల మంతనంబులు మెఱయ రతికాంత విజయోదంతంబు లగుపంతంబు లాడుచుఁ గొంతదడవు తోడియింతులఁ గికురింపుచు, నిగనిగనిపగడములవగఁ దెగడునొగరు తొగరు పొగరుచిగురులఁ గొరక నధరముల కెగిరి పగ గొను మగకోయిలల తెగతెగలు నెగు లెగయ నగపడక బుగులు బుగులుకొని మొగముల సొగసుఁజిఱునగవులఁ దగ వగునే యనుచుఁ దగుల మిగుల నొగిలి సగ మగుచుఁ బులుఁగులకు సరిఁ గనుపడ మగిడి సరిగపనిజిలుఁగుసగరపుఱయికలు బిగివగుల నిగిడి పొంకంబు లగుబింకపుఁజన్నుల నెలవంకల నింకక వెడలి యకలంకలోహితాంకురంబు లగు సంకుచిత సంకుమదకుంకుమపంకంబులు జాఱఁ బంకజరసంబులు దొలంకుకొలంకులఁ దేనియవంకల నిరువంకల నలంకరించులంక లగుకంకేళివనాంగణవిటంకంబుల మీనాంకధనుష్టంకారశంకాకరంబులై నుంకెడలినగొరువంక పల్కులకుఁ గొంకుచు జంకెనచూపు లకలంకరత్నాంకితతాటంకరుచులతో లంకెలు గొనఁ గింకరీజన సంఘాతంబులవంకలఁ దలంక నిలుపుచు, నందంద యరవింద గంధ తుందిల మందానిలసందోహంబులఁ గందళితకుందచందనమందారబృందాన్వితంబులై కురువిందమణిసందీపితంబు

లగు కెందలిరుచెందురకావిచందువల నొంది మకరందబిందు బృందంబులపొందునఁ జెందునందంపుగురివెందపందిరులయందు నానందంపుఁజిందులుగొనునిందిందిరసందోహంబులసందడు లేచి క్రందుకొన డెందంబులు కొందలపడ నిందిరకు మందిరంబు లగు కెందమ్ములకందువలకుఁ బందెమ్ములు సఱుచుచు నందఱు బిఱుఁదుల డిందఁ గొందఱు ముందఱ నరిగి యిందిందిరముఖరితాళిందమ్ములగుకందర్పవిజయమాకందమ్ముల క్రిందఁ బిఱుందులు చలింప నందియలు మొరయఁ గుందనంపుసందిబొందియలు చందోయి నొరయఁ జిందులుద్రొక్కుచుఁ గందుకకేళిం దేలుచు నిట్లు విహరింపుచుండ ఫలపరిపాకసౌభాగ్యసంపన్న శుకసంభాషణంబై భాగవతంబుకరణి, వసుమతీజాతాభిరామంబై రామాయణంబుపగిది, నారూఢహారికుమారబాణాసనంబై భారతంబువైఖరి, నామోదితసుమనోవిసరంబై యింద్రనగరంబు బాగున, స్నేహీభూతగంధవాహంబై ధనంజయ నివాసంబుపోలికఁ, జక్రాంగపాళికాసరస్ఫురితంబై దండధరునిలయంబుభాతి, భాసితపలాశంబై నైరృతినిశాంతంబుచందంబున, ననుగతరసవిలసితంబై వరుణమందిరంబు రీతి, సముదితగంధబంధురంబై పవననిభవనంబుకైవడి, విలసితకుందంబై రాజరాజనికేతనంబుచాడ్పునఁ, గందళితమహాపర్ణాభిశోభితంబై కైలాసంబుతీరున, జాతిరహితంబై యభేదబ్రహ్మంబుచెలువున, నఖిలద్విజసూక్తిగ్రాహ్యంబై మాధవుని యందంబున, శుకముఖవనప్రియచయంబులకు నిష్టఫలంబు

లొసంగుచు సకలవిధకుసుమాకరంబై, కుసుమాకరం బొప్పు
చున్న సమయంబున. 18

## సూర్యాస్తమయవర్ణనము.

సీ. కరినాథుఁ బట్టునక్రంబుపై విడిచిన
సరసిజాక్షునిచేతిచక్ర మనఁగ
వరుణదిక్సుదతికి వాసవుఁ డనురక్తిఁ
బంపిన కెంబువ్వుబంతి యనఁగ
నపరశైలాంతహర్మ్యాగ్రజాలాంతరా
ర్పితమహాదర్పణబింబ మనఁగ
భువనాధిపతినిజపురమందు బిరుదుగా
వల నొప్పు నెత్తినధ్వజ మనంగ
నభ్రసుందరి సుగుణరత్నాకరునకు
మేలు గలుగంగ బలురతనాలు గూర్చి
పట్టె త్రిప్పెడిమూరతిపళ్లె మనఁగఁ
గమలమిత్త్రుఁడు చరమభాగమున నొప్పె. 19

మ. ఎనయన్ సత్ప్రతియంతరీపమునను౦ డేతెంచి యే మెంచునో
యనుశంకం గడుభీతిచే ఖరకరుం డబ్ధిం బ్రవేశించెనో
యన నస్తాలయవాటికిం జనియె నుష్ణాంశుండు తత్పీడ నే
య్యానఁ దప్పెం గద యంచు నక్కవలయుం బానందమున్
[జెందఁగన్.

ఉ. వారణదిగ్వధూటి నిజవాటికిఁ బ్రేమ నినుండు రాఁగఁ దా
భూరిముదంబునం బొదలి భూరిమణీగణభూషణాలికిం

పారెడుపట్టుచీర మెయి నంట ఘటించి కుచద్వయంబునన్
గూరిమికుంకుమంబలఁదెనో యనఁ సాంధ్యముదోఁచె నయ్యె[డన్.

క. ఇనుఁ డరిగె ననుచు సమయాం
గన నీలపటంబుఁ దాల్చి గలయాశల మే
కొనియెడుఁ జారిణికై వడి
ననఁ జీఁకటి పుడమిఁ జెలగె నతిబహుళంబై. 22

చ. అపరనఘాటికామణికి నై యతిమోహముఁ జెంది రాజు చో
క్కపుసిరి గల్గుమంత్రఘుటికావతి విచ్చినపూలుఁ గొన్ని
యం, దపుఁగపురంపుఁబూసలు ముదంబున వశ్యతఁ గూర్పఁ
బంచెనా, నపుడు సరోజజాండమున నంతటఁ బారులు దీరెఁ [దారకల్.

చ. మఱుఁ దనుభూమిపాలునకు మాపటివేళల దిక్పురంధ్రులున్
విరులును లాజలుం గలిపి వేడుక సేసలు సల్లిరో యనన్
సరవినభస్థ్రప్రదేశ మనుసౌధమునం బొనరించుదివ్యసుం
దరతరవజ్రపాళిక లనం దగెఁ జుక్కలు బిక్కటిల్లఁగన్. 24

## చంద్రోదయవర్ణనము.

మ. కుముదంబుల్ వికసింపఁ గోకములు సంకోచింపఁ గామిప్రజా
లిమనంబుల్ దిలకింప నద్దెసలుఁ దెల్వొంజెంది రాణింప న
క్కమలంబుల్ ముకుళింప వెన్నెలలు వేడ్కన్మింటసూచింపసం
తమసంబున్నశియింపఁ జిత్తినులచిత్తంబుల్ విజృంభింపఁగన్.

చ. తొలిదెస కెంపునొంద నయుతుల్బయమందఁ బయోధిపొంగఁ
ద, మ్ములు మొగుడంగఁ గల్వలు ప్రమోదమునింప నరు
ల్బులింప మి, న్నెలయఁ దమిస్రముం బొలియ వెన్నెలపుల్గు

లుఁ జేర మూరుఁ డ, గ్గలముయి మీఱఁ జందురుఁడు గాం
తుల జల్లుచుఁ దోఁచె నెంతయున్. 26

తే. మదనుఁ డిగురాకుతూపులు పదనుపెట్టు
కళలు దేఱెడుశాణచక్రం బనంగఁ
దామసీసతికర్ణావతంస మనఁగ
నుదయగిరిఁ జంద్రమండలం బుదిత మయ్యె. 27

యామినీపూర్ణతిలక యుద్యానంబున విహరించుట.

వ. ఆసమయంబున యామినీపూర్ణతిలక యనుగతసఖీతిలక యై ప్రొద్దు వోక నిదురరాక లేచి కేల్ సాచి నవ్వాసలం జూచి దండ నుండునొక్క వేదండయానం గైదండ యిడి మందగమనంబున బృందారకసుందరీసందోహమునకుఁ గడు నెడ యై నందనవనంబునకుం దరలుపుసొంపు లొలిపెడువదనచందంబున నందం బై యుద్యానవనసమీపంబునకు నుద్యోగ యై చని చని యచ్చట నచ్చపుఁబచ్చరాలమెచ్చుగుతిన్నెల వెన్నెలపాడలు గడలుకొనఁ జివురుజొంపంబులసొంపొందినమాకందంబులచెంతఁ గొంతసేపు విశ్రమించి తదాశ్రితవనితాజనతాకల్పిత ఫలకుసుమాద్యుపధానంబుల వార్షంబు నొంది యువ్వలఁ జని జవ్వనులం బిలుచుచు నవ్వసిఁ గలయం దిరుగుచు మంజుతరకుంజంబు లరయుచు నంబుయంత్రంబులఁ జూచుచు పాదులు గట్టి బోదులు చేసిన మల్లికావల్లికాదులఁ నవలోకింపుచు నింపులు మెఱయ సంపెఁగలు గోయుచు సొంపు సంపాదింప సాలంబుల లోలంబు లగుశిఖాజాలంబుల సయ్యాటంబులనొయ్యనొయ్యన

నుయ్యాల లూగుచు, బాగుమీఱినవికటతటినీతటనివసిత సికతాతలంబులఁ గప్పురగంధులతోడ నొప్పఁగఁ గప్పురంపుఁ దిప్పలమొగసుల గప్పి వెన్నెలకుప్ప లాడుచు దప్పినఁ జప్పటు లప్పళింపుచు నొకనొకరిం గికురింపుచు నాటలఁ బాటలఁ బూఁదోటల నిట్లు విహరింపుచు. 28

రగడ. అలివేణిరో మన కామోదంబులు
గలయఁగఁ జేయును గలనాదంబులు
పెంపు జిలిర్పఁగఁ బికవారంబులు
గుంపులుగొని పల్కుచుఁ గీరంబులు
జాలగు తేఁటులఝుంకారంబులు
నోలిగ శారీహుంకారంబులు
పరగఁగ నొప్పుచుపాటీరంబులు
మెఱయుచు నుండెను మేటీరంబులు
వడరు నెపుడుఁ గుసుమాసారంబులు
గడువడిఁ బొకురె కాసారంబులు
గలిగినచోటికిఁ గదలుఁడి తావులు
గలిగినఁ జాలును గపురపుదీవులు
చూడరె యెంతో సొంపై యున్నది
పోడిమిఁ జెప్పగ మునుపే కన్నది
కంటే నక్కువ గాదా వాటికి
నంటివె పోదగు యూనవనవాటికి
పదవే పోదము పదుగురు మిప్పుడు
పదరక పోవలె బలుకాల్ చప్పుడు

వినిన బెగడి పోవే రాయంచలు
పనివడి నే ర్పేర్పడగాఁ జంచులు
చాటుఁ జేసికొని చనరే యింతులు
మాటలాడకురె మఱి మీరంతులు
ఎక్కడ వచ్చిన నేమన మీరలు
అక్కరొ వింటివె యాని మీ వాకలు
నేయఁగ నన్ననఁ జెలువే నీకును
బోయుద నుండవె పొలఁతినో నాకును
బని యేమున్నది పలుకే మంచిది
మనలేనా నీమాటలసంచిది
తేటగ మన మీ తేనియవంకలు
దాఁటఁగఁ దరమే శలభపు శంకలు
మానరె చూచిన మంచిది వెన్నెల
కానికాని మఱి కపురపుఁదిన్నెలఁ
దరువులనీడల దాఁగిలి మూఁతలు
పరఁగ నానందము పదుగురునాతులు
రాకే నే నీరమణిని ముట్టితిఁ
గోరికి మీఱఁగఁ గొమ్మనుఁ బట్టితి
బంతు లానందము వంతులు గట్టుక
చెంతకు రమ్మా చెలిఁ జేపట్టుక
పువ్వులుఁ గోయుద మివ్వనితావుల
దవ్వా పోదము తనరెడుతావుల
కిమ్మై యున్నవి యివిగో పువ్వులు

నీమహిం రాలిన వేఱరె పువ్వులు
గాఢిగ వెన్నెల గాయగఁ దరువుల
నీడలఁ బొడవెన్నెల లీయిరువుల
కేతెంతము మఱి యిందఱు వేడుక
నాతత కేళుల నందఱుఁ గూడుక
నాడుచుఁ బాడుచు నతివలు ఘనముగ
వేడుక చేసిరి వెలఁదిని ధనముగ. 29

క. అం దలసి సొలసి రాజపు
రందరకన్యాలలామ రమణులు వేడ్కం
జెంది యుపచారములు సే
యం దగ శయనించె సుమాస్తృతాంచితశయ్యన్. 30

తే. అట్లు శయనించి కూరుకు నంది యంద
నంతలో లేచి వివశాత్మ యై కలంగి
తెలిసి కనుమూసి క్రమ్మరఁ దెలివిఁ గాంచి
కాంచి దిక్కులఁ జెలులను గాంచి కాంచి. 31

తే. మగిడి శయనించి మఱి లేచి మై విదిర్చి
మదినిఁ దలపోసి తలపోసి మరునిగాసి
కిని భరింపఁగ లేక మాగ్నైనయుఁ జిక్కి
పల్క నేరక యున్న నప్పడఁతు లెల్ల. 32

క. ఇది యేమివింత యిచ్చట
నిదురించెను లేచి లేచి నెఱి మనములఁ జూ
డదు మాటలాడ దెంతయు
నిది యేమో తెలియనేర మే మందఱమో. 33

వ. అని యిట్లు తనలోఁ దాము వితర్కించి చుట్టుముట్టి రాపట్టి
నిట్టట్టుఁ బట్టి యట్టె దాని మొగంబుఁ గనుఁగొని యొక్కసఖి
యి ట్లనియె. 34

క. ఓయమ్మ యేమి యిది నీ
కీయెడ మముఁ జూచి పల్కవేమీ యిపుడున్
డాయవు కారణ మేమీ
పాయనిదయతోడఁ జూచి పల్కుము తన్వీ. 35

చ. అన విని చాలఁ దెప్పిరిలి యాసఖిఁ గన్గొని పల్కెనో సఖీ
వినుమొకవింత యేనుభువిఁ బచరియించెద నైనఁ జెప్పెదన్
వనిఁ జరియించి యిచ్చటికి వచ్చి ముదంబునఁ బువ్వుసెజ్జ నిం
పునశయనించియుండుతఱిఁ బొందుగఁ గూర్కెడినంతలోపలన్.

చ. ఒకకలఁ గంటిఁ గంటి ఘనునొక్కని చక్కనివింటివానిపో
లికఁ దనరారువాని నవలీమసకాంతుల నొప్పువాని సం
వికసితసారసాక్షు మఱి విన్నది గన్నది గాన మెప్పుడో
సకి యిట వచ్చి నాసరస జాణతనమ్మున నుండె నుండినన్. 37

ఉ. నేనును వానిపై రఁగ నేరక మారకఠోరకార్ముక
జ్యానినదంబు సోఁకి తమినందె చెపుడ్పడి చూచుచుండ వాఁ
డూనినప్రేమదివ్యఫలమొక్కటియిచ్చి యదృశ్యుఁడయ్యెఁ జం
ద్రాననచంద్రుఁ డజ్జలధరాంతర మొందినరీతి నంతటన్. 38

ఉ. తత్తరపాటుఁ జెంది మది తల్లడిలంగను మేలుకొంటి నా
చిత్తజసన్నిభాంగుఁ డెటఁ జెందెనో నన్నిటుఁ గ్రూరుఁడై నయా
చిత్తజుబారినిం బడఁగఁ జేసె నిఁకెం దమిఁ దాళఁ జాల నే
నిత్తఱిఁ బల్కవమ్మ దయ నిందుల కేమియొనర్తు భామినీ. 39

వ. అనిన శుకవాణి యి ట్లనియె. 40

ఉ. ఈకల మంచిదమ్మ మది నిందుకు సంశయ మొందకమ్మ యా
శ్రీకరగాత్రు దర్శనము చేకురునమ్మ శుభావహంబు సు
శ్రీకర మైనపంచు సుశసిద్ధియు నౌఁగదవమ్మ మేలు మే
లీకల మాకు సమ్మదము హెచ్చెఁగదమ్మ సుధాకరాననా. 41

వ. అని యిట్లు పలుకుచున్న సమయంబున. 42

సీ. మలయాగముల జాతి వలయాగములఁ దూఱ్చి
కలయాపగలఁ జేరి పొలుపు మీఱి
ఘనసారసము పొంది ఘనసారములఁ జెంది
ఘనసారఁ జెలువంది తనువుఁ బొంది
మల్లికానవహేమవల్లికాసుమసోమ
తల్లికాయుతసీమ నల్లికఁ గని
కేళికారతిలోల బాలికాసుకపోల
పాలికాసవలీల మేలుఁ గాంచి

తే. శారికాకీరపరభృతచంచరీక
కలితకలకలనినదసంకలితచలిత
విరహిజనమానసాంభోజవీథి యగుచుఁ
గలయ నేతెంచె శీతలగంధవహుఁడు. 43

వ. అట్టిసమయంబున. 44

శా. రాకాశీతమయూఖజాలములు మేరల్ మీఱి మై నిండ ను
ద్రేకాంభోజశరాశుగావళులు లోఁ ద్రిప్పారఁ బాటీరశై
లైకాంచత్పవనంబు పై పయిఁగవుల్ హెచ్చ విజృంభింపము
కాఁకం జెంది సహింపఁజాలక తమిం గాసిల్లి మూర్ఛిల్లినన్. 45

వ. అచ్చటనున్న నయ్యాళీసందోహంబు హాహాకారంబులొంది. 46

ఉ. ఇవ్వని కేలవచ్చితిమి యిందఱమున్ గుమిగూడి వచ్చి యీ
పువ్వులతోఁట నేలసొరఁబూనితి మిప్పుడు పూని యిచ్చటం

గ్రొవ్వన నేల నిల్చితిమి గొబ్బునఁ బోక యటంచు మిం
చుబోం, డ్లవ్వనజాక్షిఁ జూచుచును హా యనుచున్ మది
[సంభ్రమించుచున్. 47

చ. కలగను వారలుం గలరు కల్గిన నీకలవంటి దెక్కడం
గలుగును గల్గె నిర్విఘ్నము గాసిలుచుండెడి కాంత తెక్కడం
గలరు వధూటులారయిఁక గార్యము మీఁద వచింపరమ్మయీ
చెలి నిట నుంచఁగాఁ దగదు చేసెద నింటికి వేగ బాగుగన్.

వ. అని యిట్లు చింతించుచుండఁగా శైత్యోపచారంబుల నలిపి సేద దేర్చి
యారాజపుత్త్రిని దోడ్కొని పోయిర యాలోన. 49

బిల్హణుఁడు చంద్రుని వర్ణించుట.

సీ. సాంధ్యకృత్యములెల్లఁ జలిపి యిష్టంబైన
యీశ్వరునకు నమస్కృతులు సలిపి
భుజియించి తావులఁ బొలుపైన చందన
మలఁది పువ్వులు దాల్చి హారరాజి
భరియించి వలువలు ధరియించి తాంబూల
మును జేయుచును వచ్చి మోద మంది
శయ్యాతలంబున శయనించి చంద్రునిఁ
బరికించి వీక్షించి భావ మలర
తే. నింపుమెయి బిల్హణుండు వర్ణింపఁ దొడఁగె
నిదియు విరహిణులకుఁ జూడ మదనతాప
మెదఁ బొడముఁ జేయుచి తనం బెన్న మఱియు
మరునకు బలంబు వరచంద్రమండలంబు. 50

వ. అని మఱియు నిట్లనియె. 51

చ. కలువల నిద్ర లేపి రతికాంతునిమాంద్యము వాపి పుష్కర
స్థలిఁ దిమిరంబుఁ జోపి రతిఁ జాలనిబాలల నూపి దేవతా
వలి కమృతంబుఁ జేఁపి యలవాసవదిక్సతికుండలంబు నై
కలువలతేనిమండలము కాంతిలుచున్నది తూర్పుకొండపై. 52

చ. ఇది గగనంబుగాదు నుతియింప సుధానవరాశిగాని మేల్
వదలనితారకానిచయపంక్తులుగా వివి ఫేనఖండముల్
గుదురుగఁ జుట్టుకొన్నవరకుండలి గా కిది చంద్రబింబమా
యిదియనుజిహ్మగాదు పవళించినవిష్ణుఁడుగానిచూడఁగన్.53

చ. అరయ నభస్తలం బనెడియందపుగందపుసానపై రుచిం
బరఁగినచంద్రబింబ మను బాగగుచందనరాశి పై పయిఁ
నెఱయఁగ వాసనార్థమయి నించినకస్తురిఁ బోలి యొప్పె శ్రీ
కరముగ నీకళంక మనఁగా నను వై విలసిల్లు నెంతయున్. 54

చ. అరయఁగ జంద్ర నీయుదరసుందలినల్పు నటంబటంచుఁ జా
మరమృగమంచుఁ బల్కుదురు మానుగఁ గొందఱు నేవచించెదం
గరిగమనాధరస్థలులఁ గమ్మఁదనంబు ఘటింప ధాత సిన్నొ
రసి సుధారసంబుఁ గొనెనో యనిజాలము నాఁటనుండియున్. 55

చ. జలనిధిపంకమంచు మహిచాయయుఁ జిహ్నము లేడిపిల్లకం
దళితసురేంద్రనీలమణిధామ మటంచు వచింతు రంద ఱీ
కలువలతేనియందుఁ గళంకండును నే ననుకొందు రాత్రియం
దలవడ మ్రింగినట్టితమ మంతరసంస్థ మటంచు నెంతయున్.56

ఉ. చందురుఁ డన్మృగాధిపతి శౌర్యవిజృంభణవృత్తిఁ బూని పౌ
రందరదిగ్ధరేంద్రకుహారంబుననుండి రుచుల్ సెలంగఁగా
మందల కేఁగుదెంచుచుఁ దమఃకరికుంభము స్వాంశురేఖికా
బృందనఖంబులం జిదుమవీడినముత్యము లయ్యెఁ దారకల్.57

సీ. ఈకళానిధివల్లనే కదా దిక్కుది
క్కులవారలెల్లనుఁ దెలివిఁ గనుట
యీనసుఖనివల్లనే కదా విబుధులు
కోరికల్ దీఱంగఁ గుడుపుఁ గనుట
యీమహౌషధివల్లనే కదా సభ్యు లె
న్నఁగ నిశాచరులెల్లఁ దెగులు గనుట
యీసత్ప్రభునివల్లనే కదా మోదించి
కువలయం బెచ్చుగాఁ గూర్మి గనుట
తే. యపుర! యీరాజుమహిమ యేమనఁగ వచ్చుఁ
దమము వారించి యమలసంతతి నడంచి
యన్యరతి డించి హరిపద మాశ్రయించి
యుదయగిరిదుర్గముననుండి యొప్పుచుండె. 58

ఉ. ఈయుదయాద్రి రాజశిఖరీశ్వర మీాసితభానుఁ డెన్న దా
తాయని నేలుశంకరుఁడు కప్పు గళచ్ఛవి దాపుచుక్క వై
నాయకమూర్తి యీాప్రముఖనాళులుదక్కినచుక్క లుఱ్ఱమహా
శ్రేయమొసంగు స్వప్రరుచిఁ జెందిభజించుని యోగిపాళికిన్.

సీ. ద్విజరాజటంచు భావించుటయేకాని
దూషిగా దోషాకరుండు వీఁడు
సన్మార్గగతుఁ డంచు జనులు పల్కుటెకాని
దండి మీాఱినవిశాటుండు వీఁడు
సమృతకరుం డంచు నాఖ్యమాత్రమెకాని
చర్చింపఁగా విషజనుఁడు వీఁడు
కువలయప్రియుఁ డంచుఁ గోరి సెప్పుటెకాని
పాడి దప్పినచక్రవైరి వీఁడు

తే. తమము వారించురా జనుక్రమమె కాని
యేపు మీఱంగ నారుల నేఁచు వీఁడు
ననుచుఁ గలటలు దూషింతు రనుచు జనుల
త్రోవ రా వెఱచితొ నీవు తోయజారి. 60

క. సురల తెరవు వో సాగితి
వరయఁగ సత్పతివ దే నిశాటుఁడవా నీ
కిర వొందఁగ విధునామము
హరి హరి తలపంగఁ జెల్లునా కమలారీ. 61

క. కమలంబున జననం బయి
కమలాసనుఁ డనఁగఁ బరఁగి ఖరకరమతిచే
దమియింతురే వియోగుల
క్రమమున నావిడిచి మలినగర్భుం డందున్. 62

చ. హరి కబళించుటల్ హరునకంబకమౌటఁ దమిస్రయందుఁ దే
జరిలుట నీటఁబుట్టుటను ఛాయలుగాంచుట మేను బెంచుటల్
ధరణిధరంబు లెక్కుటను దగ్గుట మిన్నులుముట్టి వచ్చుటల్
గరకరిఁ శాంధకోటులను గాల్చుట నగ్నివి సిద్ధమే శశీ. 63

సీ. ఓరి మాయను రేలపోసికొనెదవురా
తోరంపునీమేను దొంగిపోను
జెలఁగి రాపేల చేసెదవురా ఖేచర
పాళి నీకండలు పంచుక తిన
నీలీల మము గాసి యేల పెట్టెదవురా
పర్వంబులను నిన్నుఁ బాము గఱవఁ
క్రోధించి మ మ్మింత వేధించ నేలరా
కాలారి విసరి ని న్నేలఁ గొట్ట

తే. ననుచుఁ బౌంధులు నిందింతు రందువలన
లలిఁ బ్రవేశించెనో యిం కళంక మొకటి
గాకయుండిన శుచిమూర్తిఁ గాంచు నీకు
మలినతావృత్తి గలుగునే జలజవైరి. 64

సీ. పొంచి యెంతయుఁ దోడఁబుట్టినదానిల్లు
కంపవెట్టిన మహాఖలుఁడు వీఁడు
చలపట్టి వెస నిశాచరవృత్తిని సదాళి
తేజంబు లడఁచు నిందితుఁడు వీఁడు
కలఁగి ఘోషింపఁగాఁ గన్నతండ్రినిఁ బట్టి
భంగపెట్టిన ఘోరపాపి వీఁడు
మెఱసి యాపయి నున్న మిత్త్రునివిభవంబుఁ
జూడఁ జాలని నికృష్టుండు వీఁడ
తే. టంచు భువిలోన విరహిణు లాడుకొనఁగ
సిగ్గు దోఁపక మిన్నంది చెలువుమీఱఁ
దిరుగుచున్నావు మీఁ దింత తెలియలేక
తాళు వెన్నెలచీఁకట్లు ధవళకిరణ. 65

సీ. మేర దప్పనివాఁడు మేదిని నీతండ్రి
నిత్యజీవనవృత్తి నీదుతల్లి
యిష్టసంపద లెల్ల నిచ్చు నీతోఁ బుట్టు
నెమ్మి శ్రీగలవాఁడు నీదుబావ
వరసుమనోధర్మపరుఁడు నీయల్లుండు
నిర్మలచిత్త నీధర్మపత్ని
చక్రపాలనకళాశాలి నీమిత్త్రుండు
విబుధులపాలు నీవితరణంబు

తే. తనుమువారించు నీదుసందర్శనంబు
నిఖిలజనులకు మోదంబు నీదుమూర్తి
యిట్టిసంపద గలుగు నీయట్టిరాజు
గోరి చూచినఁ గలఁడె మోకువలయేశ. 66

వ. అని యిట్లు బిల్హణుండు జంద్రునిం బేర్కొని బహుప్రకా
రంబుల వర్ణించుచున్నయెడ. 67

తే. భోజనము సేసి కొప్పునఁ బూలు ముడిచి
చందన మలంది తాంబూల మంది వేడ్కఁ
బొలుపుగా వచ్చి యామినీపూర్ణతిలక
యవనికాభ్యంతరమున శయ్యను వసించి. 68

ఉ. అక్కడ నాకవిక్షితివరాధిపుఁ డిందునిఁ గూర్చి నేర్పునన్
వాకొని తద్విశేషములు వర్ణన సేయుఁగ నాలకించుచోఁ
దేఁకువ విస్మయాంబునిధిఁ దేలి మనం బలరంగ శంకచేఁ
గోకిలవాణి యిట్లనియెఁ గూరిమితోఁ దనలోన నేర్పునన్. 69

రాజసుత బిల్హణునిచంద్రవర్ణనము విని వితర్కించుట.

క. తమజనకుం డీసత్కవి
నమరఁగ జాత్యంధుఁ డనుచు నాడి వచించెం
గ్రమ మొప్పఁ జంద్రవర్ణన
సుమహితముగఁ జేయఁదొడఁగెఁ జూచినకరణిన్. 70

శా. అంధుం డెక్కడ! చంద్రుఁ డెక్కడ! తదీయంబైనయవ్వర్ణనా
బంధం బెక్కడ! యిట్టివింత గలదే! భావింప నెచ్చోటనై
నం ధాత్రీంద్రుఁడు మాకునిర్వురకు నందంబొప్పనన్యోన్యహృ
త్సంధానం బగునంచుఁ జేసె నిటులం జర్చింప వేఱున్నదే? 71

వ. అని మఱియును. 72

క. వ్రతభంగ మయినఁ గానీ
మతిమంతు నుదాత్తవేషు మానితవిద్యా
న్వితునిం గాంచెదఁ గన్నుల
కతుల మహోత్సవముగాఁగ యని చెలి ప్రీతిన్. 73

యామినీపూర్ణతిలక కవినిఁ జూచి మూర్ఛిల్లుట.

సీ. వినుతవిద్యాజితద్విజరాజు ద్విజరాజు
రుచిరాజి నగుమోమురుచులవాని
రమణీయవాణి భారతికాంతు గతికాంతు
నతికాంతిఁ దెగడుసోయగమువాని
నతులితశుచివిభాహారిమిత్రు హారిమిత్రు
వరమైత్రి గల్గువైభవమువానిఁ
గలితతేజోల్లసత్కమలాప్తుఁ గమలాప్తు
గమలాప్తి మెఱయుచందములవాని
తే. సకియ మది నెంచి తమి మించి సంభ్రమించి
కరము లలరించి తెఱ వంచి కందళించి
పొంచి తిలకించి పులకించి పొలుపుఁ గాంచి
కాంచె రోహిణిఁ జంద్రునిఁ గాంచినట్లు. 74

క. కాంచినయంతనె సతి పుల
కాంచిత దంతురితదేహ యై నిశితోద్య
త్పంచశరశరవిపాటన
సంచలితస్వాంత యై వెస ధృతి దూలన్. 75
తే. పరవశత నొంది మూర్ఛానుభావ యగుచుఁ
బవనచాలననిపతితవల్లిమాడ్కిఁ

పంకజాయతలోచనఁ బడియె మఱియుఁ
బట్టు దప్పినకనకపుఁ బ్రతిమఁ బోలి. 76

ఉ. ఆకడ బిల్హణాఖ్యకవి యత్తఱిఁ దామరసారిఁ గూర్చి యెం
తో కరముప్పతిల్ల వినుతుల్ పచరింపుచునుండి యంతలోఁ
బ్రాకటబద్ధకాండపటిపై రమణీమణిమోముఁ జూచి య
స్తోకమహోదయాద్రిపయిఁ దోఁచినచంద్రునిఁ బోల్చి యి
[ట్లనున్.

—— బిల్హణుండు రాజకుమారిని జూచి వర్ణించుట. ——

సీ. రాకేందుబింబమో రాజీవమో మించు
టద్దమో లేక నెమ్ముద్దుమొగమొ?
చెలువొందుకల్వలో చేపలో మరునినా
రాచంబులో లేక లోచనములో?
కోకంబులో విరిగుత్తులో బంగారు
కుండలో లేకవక్షోజయుగమొ?
క్రొక్కారుమెఱుఁగో మేల్పుక్కయో నునుఁబైఁడి
తీఁగయో వే ఱొక్క తెఱవయొక్కొ?
తే. ~~యహహ!~~-యీకళ యీతావి యీరమణత
యీవిధంబులు నీబెళ్కు లీకుశలత
యీసువృత్తత యీసొంపు నీమెఱుంగు
నీతళుకునిగ్గు లీచాయ లెందుఁ గలవు. 78

సీ. హరిణవిముక్తశీతాంశుబింబము గాని
పరికింపగా నిది ముఖము గాదు
ఘనసుధాపూర్ణకాంచనకుంభములు గాని
చర్చింప నివి యురోజములు గావు

పంచశిలీముఖబాణపంక్తులు గాని
　　కుటిమీఁఱ నివియు ముంగురులు గావు
నిరుపమయువజననిగళంబు లగుఁ గాని
　　యమరంగ నివి వీక్షణములు గావు
తే. డాలు మించినమించుటద్దాలు గాని
గణుతిఁగొన నివి గండభాగములు గావు
సోయగంబయినబంధూకసుమము గాని
భావమున నెన్నఁగా నిది మోవి గాదు. 79
మ. క్షితి నిర్ణిక్ష శశిరేఖ విల్లుఁ గలువ ల్చెందమ్మి రేకబ్జము
న్లతికల్ గుంభములాకసం బిసుకదిన్నల్ రంభలుంగాహళుల్
శతపత్రంబులు భావలీలఁ గొని యీచంద్రాస్య ఫాలాక్షుని
ర్జిత దేహార్థ శుకరాజవాహు మొలపించెన్నేనఁ జిత్రంబుగన్.80
మ. ఉరువక్షోజయుగాంతరస్థ మయి నాయుల్లంబు రాదేమి త
ద్భరసంఘృష్టి నశించెనో విరహసంతాపాగ్నిచేఁ గ్రాఁగెనో
స్థిరలావణ్యసుధాంబుజాకరవరాప్తిఁ మున్గెనో కామత
స్కరవీరుండు హరించెనో నవనయగకాంతారసంచారుఁడై.81
వ. అని మఱియు నిట్లనియె. 82
సీ. ఈభామతనుకాంతి నేపారఁ జూచిన
　　హేమాభిధానంబు నెంచ నేల
నీచానయూరుప్రభాచాకచక్యంబు
　　రంభాభిరూప్యంబు రహిఁ నడంచు
నీరామనవ్యనాసారమ్యలీల తి
　　లోత్తమాఖ్యను దల నెత్త నీయ
దీకొమ్మ కన్నుల నిర వొందుబెళుకులు
　　హరిణీవిలాసంబు నపహసించు

తే. నిటుల గాత్రైకదేశము లటనుటించు
సౌరవారవధూటికాసామ్యకలన
మనుజలోకంబునం దుండు మానవతు ల
నంగ నెంత కానా దీని మానంగ వశమె. 83

సీ. చెలియ పెన్నెరిగుంపుఁ జేపట్టఁ గలిగెనా
ఘనసంపదలు వేడ్కఁ గాంచినట్లు
కాంత మోమున మోముఁ గదియింపఁ గలిగెనా
యతులితరాజత్వ మందినట్లు
ముద్దియకన్దోయి ముద్దాడఁ గల్గెనా
యింపున్మైఁగువలయం బేలినట్లు
వనితకంఠాశ్లేష మొనరింపఁ గల్గెనా
యరుదారఁ బెన్నిధి యబ్బినట్లు
తే. కలికికెమ్మోవిచవిఁ జూడఁ గలిగెనేని
యురుసుధాహారవైభవం బొందినటుల
నెలఁతతోఁ గూడి క్రీడింపఁ గలిగెనేని
యతనుసామ్రాజ్యమంతయు నమరినట్లు. 84

ఉ. అందపుఁగౌను శ్రీహరి నహర్నిశముం భజియించి తత్పదం
బందెనటంచుఁ జన్గవ తదాకృతిఁ గాంచె గిరీశుఁ గోరి యా
రుందగఁ జూచి వెంటఁబడి రూఢికినెక్కుట యెట్లటంచుఁ దాఁ
జెందె నహీనవృత్తిసువిశేషత నిర్వ్వరకుం బ్రియంబుగన్. 85

చ. వనజమహావిభూతి హరివైఖరిఁ గాంచుఁ బద స్తనోక్తులుం
వనజమహావిభూతి హరివైఖరి మించుఁ గళోరువేణికల్
వనజమహావిభూతి హరివైఖరి నెంచుఁ గరాక్షిమధ్యముల్
వనజమహావిభూతి హరివైఖరినొంచు దృగాస్యయానముల్. 86

సీ. ఈభామవదనాబ్జ మెలమిఁ గాంచినయంత
విధుని సంభావించి వెలసినట్టు
ఈచాననెరికురు లెనసి పట్టినయంత
నీలకంధరసేవ నెగడినట్టు
ఈయంబుజాక్షికన్దోయి ముద్దిడునంతఁ
గమలజసత్ఖ్యాతి గలిగినట్టు
ఈరామ కెమ్మోవి యింపార నంటిన
నరుణబింబాలోక మమరినట్టు
తే. లవుర తన కింతకంటె భాగ్యంబుగలదె
యతనుమంత్రాధిదేవత యనఁగ వచ్చు
నీచెలినిఁ బొందఁ గోర్కు లీడేరుఁ గాక
వేఱె మదిఁ బూని తపముఁ గావింపనేల. 87

సీ. సారంగముల మీఱు సారంగములఁ గేరుఁ
దొయ్యలికొప్పు కన్దోయియొప్పుఁ
బున్నాగముల నెంచుఁ బున్నాగముల నొంచు
నలినాస్యగతిసొంపు నాభిపెంపుఁ
జంద్రఖండము నేలుఁ జంద్రఖండముఁ బోలు
సుదతిచెక్కులలాగు నుదుటిబాగుఁ
గాంచనంబు హరించుఁ గాంచనంబు హసించుఁ
దరళలోచననాస తనువిలాస
తే. మవుర యీముద్దుచెలిఁ బొందినట్టివాని
భాగ్య మెన్నంగ వశమె యాపద్మభవుఁడు
దీని సృజియించువేళ వాగ్దేవి నెదుట
నుంచుకొని చేసెఁ గాఁబోలు నొండు గలదె. 88

ఉ. దీనిముఖాంబుజంబు గణుతింపఁ గళానిధియొక్కకోణమం
దూని నసించుఁగాక నయనోద్గతి వాకొనఁ గల్వలొక్కచో
మూనుగనిల్చుఁగాక మృదుమంజులవాగ్గతిఁ జెప్ప వల్లకీ, స్వా
నమటుండుఁగాక మినుచాయకుమ్రొక్కెదమధ్య మెన్నఁగన్.

సీ. ఊహించి పున్నమ యొక్క ప్రొద్దుండునో
ముద్దియనెమ్మోము ముద్దులాడఁ
దనగార సత్ఫలదానముల్ సేతునో
నెలఁత కెమ్మోవి తేనియలు గ్రోల
బంగరుకలశముల్ పరఁగఁ బూజింతునో
పడఁతిచన్గుబ్బలు పట్టి చూడఁ
జెలువొంద భూప్రదక్షిణము గావింతునో
యతివకటిస్థలి నధివసింప
తే. నిటులు గాకున్నఁ గల్గునే యింతితోడి
సంగతు లటంచుఁ దమిమీఱ నంగజాత
జాతతాపాతిశయమున సతిని మతిని
మమతఁ బెనఁగొని వర్ణించు మఱియు మఱియు. 90

సీ. పొలఁతిపాదములతోఁ బొందు సేయఁ దలంచి
తామరల్ పరికించి తమ్ము లయ్యెఁ
గలికిపాలిండ్లతోఁ జెలిమి సల్పఁగఁ గోరి
భావించి చక్రముల్ పక్షు లయ్యె
సుదతికెమ్మోవితో జోడు గూడఁగఁ బూని
చెలఁగి మంకెన బంధుజీవ మయ్యె
హరిణాక్షి నెమ్మోము నాశ్రయింపఁగఁ జూచి
మిహిరాంశుఁ డెలమి సన్మిత్రుఁ డయ్యెఁ

తే. జంద్రముఖియంగములు పంకజాతము లని
యరులని విహీనగుణి యని భరితదోషఁ
డని కదియ దూరముగఁ జేసె నాత్మనిత్య
మృదులసుస్నిగ్ధతాగంధ విదితకళల. 91

ఉ. పట్టుగ నీవధూటికచపాళిభజింపఁగ నీలమేఘ మే
గుట్టులఁ జెందునో ముఖముఁ గోరి నుతింపఁగఁ బూర్ణచంద్రుఁడే
తెట్టునఁ జేరునో మఱియుఁ దార్కొని మూఁగుదలంపఁ బాములే
పుట్టలఁ దూఱునో సమతఁ బూనఁగలేక విచిత్రవైఖరిన్. 92

మ. సతిహృత్పుష్కరసీమఁ జన్నవ గిరీశప్రార్థనల్ సేసి త
ద్గతిఁ బ్రాపించిన యూర్వమిఽవిషధరాకారంబుఁ దాఁ బూనెనా
రతిపంచాననలీలఁ దాల్చె నహ మాహా యంచు ధమ్మిల్ల మా
శితికంఠత్వము నొందనెమ్మొగము గాంచెనో సమభావంబొగిన్. 93

సీ. కాఁబోలు నిదియుఁ జొక్కపుసుధాకరరేఖ
కాదుపో నిష్కళంకతఁ జెలంగెఁ
గాఁబోలు నిది యశోకపుఁదూపుదోరమాయ
కాదుపో సశరీరగరిమ దనరెఁ
గాఁబోలు నిదియుఁ జక్కని వేల్పుపూఁబోఁడి
కాదుపో విభ్రమేక్షణము లొదవెఁ
గాఁబోలు నిదియుఁ దొల్కరితీవియ మెఱుంగు
గాదుపో నిశ్చలగతిఁ దనర్చె

తే. ననుచు రతిపతి మోహామృతాంబురాశి
మగ్నుఁడై విస్మయాక్రాంతమానసాబ్జుఁ
డై సరోజేక్షణారూప మరసి యరసి
నేర్పు మీఱంగ మఱియు వర్ణింపఁ దొడఁగె. 94

చ. కడువడి రాహువేర్చి నవకంజవిలోచనయాస్యచంద్రు నే
ర్పడర హరింపఁగాఁ దొడరి యస్మదరాతికరాతియంచు నే
ర్పడ మదిలోఁదలంచి మఱిగ్రమ్మఱి వెన్నున నిల్చెనోయనన్
జడ యలరున్ ఫణాగ్రరుచిచాతురిపైన రేగడిబిల్లపైఁ దగన్. 95

చ. కళలకు ధామమై జలజగర్వ మడంచి సుధాస్థిఁ దారకా
కలనఁ జెలంగి తెల్విఁ గని కాముకపాళికి గుండెగాల మై
యలరెడుభామినీవదన మైందవబింబ మనంగఁ జెల్లదే
కలయఁగఁ గానిచో నచటఁ గల్వలపేరిటికన్ను లొప్పునే. 96

చ. కలువలుమీలుఁదుమ్మెదలుగాంతగనుంగవకోడి యందుఁగా
వలసినకోర్కి దీనిగెలువం దగువీరుఁడు మారుఁడంచుఁ దూ
పులుగ ధ్వజంబుగా గుణముపొందికగా నయి వచ్చి దానిభ్రూ
చలనముతోన తద్ధనువుసంగతిఁ దప్పినఁ బోయె నన్నియున్. 97

క. వనితముఖాంబురుహస్థితిఁ
బనిగొని కాముకుల గెలువ భావజుఁ డెలమిం
దనయుభయపార్శ్వముల నుం
చినచక్రములో యనంగఁ జెవు లలరారున్. 98

శా. భ్రూకోదండముఁ బూని దృష్టివిశిఖంబుల్ తోనె సంధించి బ
ల్రాకాచంద్రునిఁ బట్టి రెండుతునియ ల్గావించి తత్సారముం
బోకుండ న్సవరించి పార్శ్వములనింపుల్ నింపఁగానుంచె నా
నాకం జేకుఱచెక్కుటద్దములు చెన్నారుం దళుక్కుంచొగిన్.

చ. వరసుమనోవిలాసముల వైఖరి మాని తిలోత్తమాఖ్య యీ
ధర సుమనోవిలాసములఁదద్దయుఁ గాంచెదనంచు వచ్చి యు
ద్ధురగతినువ్వుమ్రాఁకుల నధోముఖయై తపమాచరించియీ
కరివరయానవాస యయి గాంచె సమస్తవిశేషవాసనల్. 100

సీ. క్షణవిలాసమె కాని సరి రాదనె చిగురాకు
సుమనోనురాగవిస్ఫూర్తి గనినఁ
బయిచాయయే కాని పగడంబుసాటియే
యమృతాకరద్వీపమందు మసినఁ
దీర్పువన్నెలకాక దీ టౌనె బలుకెంపు
వరసువర్ణావాప్తి వఱల కున్న
నెఱుపుమాత్రమె కాని యీడె బంధూకంబు
కమ్మతేనియతోడఁ గాంచకొనిన
తే. సతతశోభాన్వితం బైన సార మగుచు
సరస మై రుచి గన్పడి చక్క నగుచుఁ
జక్కెరల మించి ద్రాక్షసం దుక్కడంచి
యమరు నీవనితామణియధరమునకు. 101

క. కుందంబుల ననమౌక్తిక
బృందంబుల దాడిమైకబీజంబులయా
నందంబుల జిగికెంపుల
చందంబుల నపహసించు సతిదంతంబుల్. 102

చ. అతులిత మైనశంఖము సమంచితగానము నేర్పు మించు నీ
యతివగళంబుఁ జెంది తనయందలి వైభవమెల్ల నిచ్చి త
ద్గతిని భజించి యంతబలుకర్కరహీఁ బొల్పడదయ్యెఁగా జడ
స్థితులకు నబ్బునే స్థలవిశేషములం దప మెంత సేసినన్. 103

తే. మున్ను దమ్ము నేఁచుపగఁ బూని మోముగాపుఁ
జెందునిందునిఁ గరము లక్ష్లిష్టకుసుమ
బిసలతలఁ గట్టి యెగిరి తన్నసము మీఱు
జక్కవ లనంగఁ జెలిబిగిచన్ను లమరు. 104

తే. వనితగంభీరసరసలావణ్యవార్ధి
యురుసుధాపూర్ణకుచకుంభయుగముఁ గాంచి
సకలలోకుల మిగుల నిర్జరులఁ జేయు
నేకకలశంబు గాంచుకంఠీశుఁ దెగడి. 105

మ. స్మరుఁడన్విప్రుఁడు యౌవనంబనుతనూజాతోద్గతిం బాల్యము
న్బరుదుం దీర్పశుభావహాద్వ్యరసమన్పుణ్యాహముం జేయుచో
వరుస న్నిల్పినపూర్ణహేమకలశ ద్వంద్వంబు నాఁ బొల్చునీ
సరసీజాస్యపయోధరద్వయము భాస్వత్పత్త్రరేఖాంకమై. 106

తే. ముగుద బాల్యపయోనిధి మునిఁగి డాఁగి
యౌవనం బనుహరిహయునలరుకృపను
జెలఁగి వెలువడి వచ్చినశిఖరు లనఁగఁ
గాంతయురమునఁ గుచములుఁ గానఁబడియె. 107

తే. పడఁతిజఘనంపుపెద్దడాబాలు వ్రాని
కాయజుఁడు పొక్కి లనుసురంగమునఁ దూఱి
తెగువఁ గుచదుర్గయుగము సాధించుకొఱకుఁ
దార్చునిశ్రేణి యన వళిత్రయము నెలఁగు. 108

చ. చెలిబలితంపుగబ్బివలిసిబ్బెపునిబ్బరపుబ్బుగుబ్బచ
న్నులనెఱిగొప్పభారమున నున్ననితిన్నెల మించుబల్పిఱుం
దుల నసియాడుకౌను పడునో యనుశంక సరోజసంభవుం
డొలమి రచించి గీల్కొలుపునివ్వసలా కన నారు తీరగున్. 109

చ. అరయఁగ నాభిపుష్కరమునందు విహారముకొంతసల్పి సుం
దరతరయౌవనం బనువనంబున బాహులతల్ చలింపఁగా
సరసపయోధర స్తబకసంగతిఁ గమ్మనితావి కెక్కి వి
స్తరగతి నేఁగుతుమ్మెదలచా లన నారు చెలంగు బోటికిన్. 110

చ. జడ యనుతోఁక వెన్కఁ దరసారపుఁగుంకుముచాఁతిరేఖయే
ర్పడఁగ మిటారిగుబ్బలను భారపుఁ గుంభములంద మొప్పఁగాఁ
దోడ రెడునారుసౌ రనెడుతుండము సాఁచి మనోజదంతిరా
జాడఁగ కసీరు ద్రావుకొలనో యన నాభి చెలంగు నింతికిన్. 111

మ. చెలిసింగారపుఁ బువ్వుదోఁటరసముల్ సెల్వొప్పఁగా నింపఁబూ
విలుకాఁడన్నలుకాఁపుగుబ్బలను మేల్బిరంబు లొద్దుల్ ఘటిం
చిలలిఁ నీలపుటారుమో కెలమి పుష్టిన్బట్టె నో యెత్తుమె
చ్చులచెంగల్వపుబావియో యనఁగ మించు న్నాభిగంభీరతన్.

క. చనుఁగవ బరువో లేకం
బెనఁకువ గలశోభనాంగిపిఱుఁదులు బరువో
యని గన విధి పిడికిటఁ బ
ట్టినపట్టో యనఁగఁ గౌను తేవ వెలయున్. 113

మ. జననాథాత్మజకాంచనోరుయుగళీ స్తంభాగ్రభాగంబుపైఁ
బెనుపై ముత్తెఱు లంత రాళులుగ నాభీద్వారమం దొప్పఁగా
స్తనజాంబూనదకుంభగుంభితతనూసౌధాంతరస్థాయి మా
రునిసింహాసనమో యనంగఁ జెలువారుంగాంచి దేశంబొగిన్.

తే. మరుఁడు శృంగారపీఠ మేర్పఱచి తనదు
పేర నొక పేటఁ గట్టె సంప్రీతిఁ దోర
జాల నుంచినకాలుకంబా లనంగఁ
గలికియూరులు చెలఁగుఁ బైఁ గాంచి మెఱయు. 115

క. మకరములను లోఁబెట్టుక
రకముగ వరశాలులను ధరం బడవై చేఁ
సకిజంఘిక లని యొంతయుఁ
బ్రకటించెం గాహళులు రవంబుల దిశలన్. 116

తే. నెఱయ సారసములు దమ్ము నేలఁ బెట్టి
కాల రాచుచు నున్నాఁడు కలువలచెలి
నెతలఁ బడఁ జాల మిది రాహువేణి యనుచు
నతివపదములఁ బడె నన నడుగు లమరు. 117

తే. నిరవలంబంబు తమయుండునిలయ మెల్ల
నందు నిలు వాదరిక లే దటంచు వగచి
వచ్చి తారక లొకకొన్ని వనితపదము
లందెనో యనవేళ్ల నఖాళి యమరు. 118

వ. అని మఱియు నిట్లనియె. 119

సీ. చెలియపెన్నెఱిగుంపు చీఁకటిఁ గాలఁ దన్నె
వదనము కళఁ బట్టి చదిపె విధునిఁ
జెలువకన్నుల లేళ్ల చెవి పట్టియాడించెఁ
గరమొప్పు గళము శంఖంబు నూఁదెఁ
బొలఁతిచన్నులు చక్రములరొమ్ము వెసఁ ద్రొక్కె
నారు సర్పముఁ గడు నంటి పొడిచెఁ
జెలికటి సైకతముల వెన్కఁ బడ నొత్తె
నెత్తమ్మి నడుగులు నేలఁ బెట్టె

తే. మిసిమిబంగారుపై నెక్కె మేనిచాయ
యేమనఁగ వచ్చు నిక్కాంతయింపుసొంపు
మించునవయువసౌష్ఠవం బెంచి చూడ
వశమె వేనోళ్లు గలఫణివరున కైన. 120

తే. కురులు కుటిలత గావించెఁ గుచములందుఁ
గఠినత విధించె సారసగర్భుఁ డెలమిఁ
జెలఁగి యీకాంతమన సట్లు చేయఁడేని
యతనిఁ బుడమినిఁ జతురాస్యుఁ డనఁగ వచ్చు. 121

కామిని మూర్ఛ దేఱి కవింగవయఁ గోరుట.

వ. అని. 122

క. ఈరీతి బిల్హణుండు మ
హోరూఢి నిజానుభావ మభినుతి సేయం
గా రామ తద్వచోమృత
సారంబున మూర్ఛఁ దేఱి సంస్మృతి గలదై. 123

తే. యామినీపూర్ణతిలక యత్యంతపులక
దేహ యై లేచి మదిని సందేహ మెడలి
యజ్ఞుని హసించుకవివదనాబ్జ మమరఁ
గాంచి యూహించె నిజవిలోకాంచితముగ. 124

సీ. ఈకమలేక్షణునెద వసించినఁ గాని
యలనిశాచరుగర్వ మడఁపఁ జాల
నీసర్వమంగళాహితుఁ గూడఁగాఁ గాని
యంగజాతవికార మార్పఁ జాల
నీవిబుధేంద్రుని హితము సేసినఁ గాని
మెసఁగి మరుత్పతి నేలఁ జాల
నీబ్రహ్మతేజుని నెనసి పల్కినఁ గాని
యిల ఖగాళి నధరీకరింపఁ జాల

తే. నితనిభాస్వత్కరాబ్జసంగతుల మెలఁగి
యేర్పడక గాని మదితమిఁ దీర్పఁ జాల
నితనియధరామృతంబు నాయిచ్చ దీరఁ
గ్రోలఁగాఁ గాని తాపంబుఁ గూల్పఁ జాల. 125

వ. అని మఱియుఁ దనలో నిట్లనియె. 126

తే. చదువుఁ జెప్పంగ గురుఁ డయ్యె సాహసమునఁ
జూడఁ జూడంగ మరుఁ డయ్యెఁ బోయగమునఁ
దలఁపఁ దలఁపంగ రా జయ్యెఁ గలితకళల
నిందు కేమి వచింతునే యిందువదన. 127

ఉ. ఏ లఘుచిత్తనై కదిసి యీనవమోహనరూపుసన్నిధిన్
బాళిని జేరితే నితనిభావ మదెట్టిదొ కాన రాదుగా
లీలఁ బరిగ్రహించునొకొ లేక గ్రహింపక పోవునొక్కొ నేఁ
దాళఁగఁజాల నింతి తనుఁదానతొడంగినఁ జుల్కనౌఁ గదా.

వ. అని మఱియును. 129

ఉ. ఏగతిఁ బోవుదాన మఱి యీతని నేగతిఁ బల్కుదాన నా
లాగు మదిం దలంపక కళానిధి కాదని పల్కునా పయిం
గాఁ గలకార్యమెట్టిదొకొ కానియెడం దనగౌరవాప్తియెం
తాగడమౌనొ యిందులకు నన్యవిచారము లేమి సేయుదున్. 130

వ. అని యివ్విధంబున వితర్కించి. 131

ఉ. రాజకుమారికామణి విరాళిని దాళఁగ లేక దూలి సం
యోజితకాండవస్త్రముపయోగ లేమికిమానియప్పుడుర్
రాజితశయ్యపైఁ బడి సరాగము గా విలపించె నాత్మభూ
రాజశరాళికిన్ నిలుపరానితమిన్ భ్రమ ముప్పతిల్లఁగన్. 132

తే. హా కళాకాంత చతురాస్య హా కఠోర
మారనిశితశరాళి వేమాఱు నాటి
కలఁచె సంతాప మొదవ నన్గరుణఁ జూచి
ప్రేమఁ గొనవయ్య బాధఁ దప్పింపుమయ్య. 133

వ. అని నర్మగర్భంబుగాఁ బలికిన నప్పలుకులు కఠోరమారవీరదోర్దండచ్చాపగుణటంకారనినదంబులుగా విని భావంబు గ్రహించి సంచలితహృదయుండయి కవిపుంగవుం డిట్లనియె. 134

→ కామినినర్మగర్భవాక్యములు విని కవి పలుకుట. ←

ఉ. తామరసాక్షి నీనిశితదారుణవీక్షణతీక్ష్ణబాణముల్
వేమఱు నాటి నాహృదయవీథి వ్రణం బొనరించెఁజూడుమా
నీమెయినౌషధద్వితయమియ్యవె త్రావెదఁబూఁతఁబూనెదన్
నీమధురాధరామృతము నీకుచకుంకుమపంక మేర్పడన్. 135

వ. అని మఱియు ని ట్లనియె. 136

సీ. కరుణతో ననుఁ జూచి కాయజుశరహతిఁ
దప్పించు మిప్పుడు తరళనయన
చిఱునవ్వు వెలయించి చెలు వయినవెన్నెలల్
మాయింపు మిప్పుడు మచ్చకంటి
పలుకులు వగ గుల్కఁ బల్కి పైకథనముల్
మాన్పవే యిప్పుడు మధురవాణి
మోవిపానక మిచ్చి మోహదంభకతృష్ణఁ
దీర్పు మిప్పుడు మోవితీపులాఁడి
తే. కరము లలరించి బిగియారఁ గౌఁగిలించి
యొడలిచలిఁ బాపవే భాస్వదురసిజాత
యతనుసామ్రాజ్య మేలించి యాదరించి
వలపు లీడేర్పవే హేమలలితగాత్రి. 137

## రాజకుమారి కవిశయ్యపైఁజేరి క్రీడించుట.

మ. అనినం దామరసాక్షి కాండపటమత్యంతంబుఁబోఁద్రోచి గ్ర
క్కునఁ దచ్ఛయ్యకుఁ జేరి ప్రౌఢగతిసంకోచింపఁగన్ లెమ్మహా
యనిచేఁ దమ్ములు చాఁపి చన్నవయెదన్ హత్తించె గాఢంబుగా
ఘనమోహమ్మునఁ గౌఁగిలించెఁ గవియుం గౌతూహలం
[బొప్పఁగన్. 138

మ. కరముం జేర్పకమున్నె పోఁకముడివీఁకన్వీడెఁ జన్దోయిఁ జె
న్నారయం బట్టకమున్నె జల్లుజవి కెంతో వ్రీలి వేపట్టున
న్విరిసె న్ముద్దుమొగంబుఁ జూచుటకు మున్నే స్వేచ్ఛనాలోకనం
బరయన్విస్మృతమయ్యెనా సతికి వ్రీడావ్యాప్తిఁ గోల్పోవఁగాన్.

చ. వలయవిశేషనాదముల వైభవసంగతభాస్వదంగకం
బులపులకాంకురప్రకరపూరములం బ్రవిబోధితాత్మభూ
సలలితతత్త్వమార్గముల జన్ను లురస్థలి మున్గునట్లుగాఁ
జెలువ సుఖింపఁ జేసెఁ గవిశేఖరుఁ బైకొని కౌఁగిలింపుచున్. 140

వ. ఆసమయంబున బిల్హణుం డిట్లనియె. 141

శా. భూరిగ్రాహగభీరభీషణమహాంభోరాసులన్ దాఁటి యా
స్ఫారంబింతయు లేనియాకసమునన్ సంచారమున్ జేయుచుం
గ్రూరోద్యన్మృగపర్వతాగ్రముల నారోహించుచున్నీయశం
బోరాజాత్మజ యొంటిమైభుజగలోకోద్వృత్తి రాజిల్లునే. 142

వ. అని మఱియు నిట్లనియె. 143

తే. రమణి మీతండ్రి మదనాభిరామనృపతి
చేసినట్టివినోదంబు చిత్రమయ్యె

చిత్తమున వేఱు తలఁపక చెలఁగు మతుల
రతుల భయ మింత వల దిట రాజు వలన. 144

వ. అని నిజాంకంబునఁ బంకజగంధి నునిచికొని శంక లేక నిరంకుశమీనాంకమత్తమాతంగంబు హృదయపంకజంబు భేదింపం దదవ్వదనశశాంకమండలంబు నాలోకించి యి ట్లనియె. 145

తే. నెమ్మితపము గావించితి నిన్నుఁ గూర్చి
జపము సల్పితి నీపేరు చాలఁ దలఁచి
ధ్యాన మొనరించి నీరూప మాత్మ నునిచి
మంత్రదేవతగా నిన్ను మంజువాణి. 146

వ. అది యెట్లం టేని. 147

సీ. సరవి నెన్నఁడును భోజనము సేయఁగ లేదు
నీమీఁది ప్రీతిచే నీరజాక్షి
యెలమిగా నెన్నఁ డింతులను గూడఁగ లేదు
నీమీఁది ప్రీతిచే నీరజాక్షి
యరయ నెన్నఁడుఁ జందనాదిచర్చయు లేదు
నీమీఁది ప్రీతిచే నీరజాక్షి
చెలఁగి యెన్నఁడు మాల్యములు ధరింపఁగ లేదు
నీమీఁది ప్రీతిచే నీరజాక్షి

తే. గాన భవదీయవిరహయోగమున నాకుఁ
గలహరిత్తులు మసకట్లు గాదనర్చుఁ
గాంచి నమ్ముఁడ నైనసత్కవిని నన్ను
రాగ మిట నూని ప్రోవవే రాజపుత్రి. 148

ఉ. ముందట నున్న్మదద్విపసమూహసమంచితకుంభ కాంత రా
మందసర క్తమేదమున మత్తిలి చూచుమృగేంద్ర మున్నస

స్పందనపల్లవోల్లసితసల్లకి యూనువె సామజంబు నా
చంద మెఱింగి పొందుమిట జాగొనరించెద వేల బాలికా.

వ. అనిన దరహాసితవదన యయి కుందరదన యిట్లనియె. 150

క. కవిరాజశిరోభూషణ
దివిషద్రాజాస్యలై నదీష్యద్భవదీ
యవరాకృతిఁ గని యేఁకా
రి వలతు రే ననఁగ నెంత శ్రీతనయనిభా. 151

సీ. శృంగారమూర్తివై చెలువొందునినుఁ జూడ
వలెఁ గాక కన్నులు గలఫలంబు
చక్కనైనట్టినీచెక్కులు ముద్దాడ
వలెఁ గాక కెమ్మోవి గలఫలంబు
మదికింపు సేయు నీయెద ఱొమ్ము వెసఁ గ్రుమ్మ
వలెఁ గాక చన్నులు గలఫలంబు
నేర్పు మీఱినయట్టినీతోడ మాటాడ
వలెఁ గాక నాలుక గలఫలంబు

తే. సేవ సేయంగ వలెఁ గాక చెలువరాయ
యలరులను గేరుచేదోయి గలఫలంబు
కలసి రతులను మెలఁగి పెన్గవలెఁ గాక
కవిశిఖామణి చెలి మేను గలఫలంబు. 152

శా. నీలావణ్యము నీకళాతిశయముల్ నీసౌకుమార్యాప్తియుల్
నీలాలిత్యము నీవిలాసగతులుల్ నీమంజువాగ్వైఖరుల్
నీలీలాతనుభాతి నీసరసముల్ నీయందముం జూడఁగా
నేలీలావతి యయినఁబొందఁగవిధాత్రీంద్రా యపేక్షింపదే.

వ. అని యిట్లుఁ బలుక సంతోషితస్వాంతుండై కవిభూకాంతుండుఁ
గాంతాలలామకు వకాంతత్వం బపేక్షించి యిట్లనియె. 154

సీ. పరభూమిభృత్తులభరము ద్రుంచినవేల్పు
మాంద్యంబు లడఁగించు నహీనకీర్తి
మైత్రిచే వెలసి ధర్మము గాంచుగుణశాలి
కర్బురచ్ఛాయలు గలుగుమేటి
ఘనపుష్పమాలిక లెనసిన వెఱజాణ
వాసనల్ ప్రాపించు భవ్యరూపి
వరయుక్తి నఖిలవైభవము లందినరాజు
చంద్రరేఖల నేలు సరసమూర్తి
తే. యగుచు నఖిలదిశావళి నాక్రమించి
ప్రేమ జనులను బాలించు పేరుఁ గాంచి
దొరలకు దొరై చెలంగును దోయజాక్షి
యెలమి నీగబ్బిగుబ్బ పాలింపఁ బోను. 155

వ. అని మఱియు నిట్లనియె. 156

సీ. మీనాకృతులఁ గాంచు మెఱయు నీకన్నులు
కచ్ఛపరేఖ మీఁగాళ్లఁ జెలఁగు
భూధరభావంబుఁ బొందు నీజఘనంబు
హరిలీలఁ దాల్చు నూఁగారుతీరు
వామనాకృతిఁ బూను వల నొప్పు నీకౌను
భూమిభృద్వైరులై మొనయుఁ జన్ను
లమరు రామాభిఖ్యయై నీముఖాబ్జంబు
నీలాంశుకస్ఫూర్తి నెగడుఁ గురులు

తే. రతులఁ దేలింపను బ్రబుద్ధురాల వవుదు
వరయఁ గలికివి యన్నిట నరసిచూడఁ
దనర నీయందున దశావతారమహిమ
రుచిరలావణ్యసీమ తారుణ్యధామ. 157

సీ. ఘనులఁ బోషించు నీకచపాళి రాజస
న్మానంబుఁ గాంచు నీనగు మొగంబు
కువలయం బలరించుఁ గూర్మి నీకనుదోయి
శ్రీలఁ బెం పొందు నీచెలఁగుశ్రుతులు
యిష్టఫలావాప్తి నెసఁగు నీకెమ్మోవి
కలల మెప్పించు నీకలికిచన్ను
లహితాప్తి నడఁచు నీయలరారునూఁగారు
సరసుల మెచ్చు నీసరసనాభి
తే. లసదనంతవిభూతి నీయసదు కౌను
చక్రములను భరించు నీజఘనసీమ
యతులభద్రకరములు నీయురిదితొడలు
పడఁతి పద్మంబు సేయు నీపదయుగంబు. 158

వ. అని వినుతింపుచున్న కవివరునిం గదిసి మాటిమాటికి సూటి
గొన సాటివచ్చు జక్కువల నుక్కడంచి నిక్కి క్రిక్కిఱియు
మిక్కుటంపుసొంపు గలసిబ్బెంపునిబ్బరపుగబ్బిచనుగుబ్బల
నురంబుతిరంబుగానొత్తి తత్తరిలఁ గేలమ్ముల నిమ్ముగాఁ గ్రమ్ము
కొన వెనుకకుఁ జనక మొనసి వనితామణి నెనసి మనసిజసంగ
రంబుతిరంబునకుఁ గరంబుదుఱంగలించి దొఱంగి మెలంగుచు నిత
రేతరసమాకర్షణంబులాచరించుచు నన్యోన్యమధురాధర సుధా

ధారానుపానక్రియాంతరదశ నఖక్షతవిజృంభణంబుల సీత్కా రంబులు నెఱపుచుఁ బరస్పరవిశేషవిషమశరసమరసముత్సాహంబుల నిట్టూర్పులు నిగిడించుచు, స్మరశిఖిశిఖరసఖంబులగునఖరముఖంబులనీటులు మెఱయఁ గాటులు పచరించుచు ముఖముఖావలోకననిరోధకచికురనికరంబులు కరంబులను గరంబుచిక్కుఁదక్కఁ జక్కసవరించుచు స్థలాస్థలవిశేషంబులవలంబించి బింబిరిగానక హింసంబు మెఱయఁ జుంబించుచు, ఘూత్కృత ఫూత్కృత భూత్కృత హుంకృత సీత్కృత గృహాణ గృహాణ ముంచ ముంచేత్యాది నినదంబుల కనుగుణంబు లగుకాంచీసమంచితఘంటికామంజుమంజీరవలయసలయ నినదంబులు వినుచు, నాగ సింహ కుక్కుట హంసాది బంధవిశేషంబులం బరిభ్రమించుచు నలయుచు, వలపులు వెలయఁ గలయుచు, నిలుకడల నిలుచుచుఁ, దొలంగినఁదొలంగక మలసి పైకొని చేకొలఁదులఁ బట్టుదప్పక విట్టట్టు తెట్టగిలక దిట్టయై గుట్టుమట్టులేక పెనఁకఁదాఁకుచు నిట్టు షష్టిహాయనద్విరదంబుల విధంబున నందంబు గాఁ గందర్పునిదర్పం బడంచి మించి సౌఖ్యవారాశిఁ దేలుచున్నంత. 159

చ. పులకలజగ్గు నెమ్మినెఱపుఁ జిగినెమ్మెయినిగ్గుఁ జెయ్యులన్
వలగొనుసిగ్గు వింతయరవాలుపుఁజూపులకగ్గు నాదలన్
నెలకొనుతగ్గు మారుమువునేర్పులనెగ్గు ఘటిల్ల నొప్పున
చ్చెలి నలరించెఁ దా రతులఁ జెందుచు మాటికి మోహ
[మందుచున్. 160

సీ. అసకృదాలింగనాభ్యాసనఖర్వితకుచం
బర్ధనిమీలనోద్యద్వియోగ
మాశానుకూలక్రియారోధిమందాక్షు
మావిశ్రమాంబుకణావృతాస్య
మతిగాఢపరిపీడితాధరాధరబింబ
మనుదితమణితక్రమానుకలన
మస్ఫుటీకృతశతధేత్యాలాపకౌశలం
బతిసాంద్రజనితరోమాంచవార

తే. మక్రమారబ్ధముగ్ధచేష్టాభిరామ
మతిశయానందపరవశాంగాంగ మవిది
తాన్యచింతన మాచకోరాక్షి కపుడు
ప్రథమసురతంబు కవిలోకపతి యొనర్చె. 161

ఉ. వెచ్చనిపచ్చిగోరు లరవిప్పనినుంగవతీరు లారజం
బెచ్చినతక్కులాత్మకపుడింపుఘటింపునుచుక్కలూర్పులన్
విచ్చినమోవికెంపు లెదనిండిన నెయ్యపుసొంపులుం దగన్
రచ్చకునెక్కజోరహిత రాజముఖీసురతప్రసంగముల్. 162

తే. పరఁగ నీరీతి రతిమనోభవులపగిది
యామినీపూర్ణతిలక బిల్హణుఁడు నతుల
రతులఁ గ్రీడలు సలుపుచు రమణ మీఱ
ననుదినంబును నల్లండి రంత వేడ్క. 163

క. తారాయనతటినీశర
తారాయన శిఖిశిఖాంక ధాతృజహారిరా
ట్తారాచలనాయక గీ
స్తారాచల రాజరాజ సఖసత్కీర్తీ. 164

భుజంగప్రయాతము. కథావిప్రధానా ప్రకాశాభిధానా
బుధారాధితార్థా ప్రభూతాఖిలార్థా
విధుస్ఫారకీర్తి సువిద్యానువర్తి
సుధామాధురీవాగ్విశుద్ధానుభావా. 165

గద్యము. ఇది శ్రీసీతారామచరణసేవాప్రభావసంపాదితకవితావిచిత్ర కాశ్యపసగోత్ర పవిత్ర శ్రీమత్పండి పెద్దికృష్ణస్వామి ప్రణీతం బయినబిల్హణోపాఖ్యానం బనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.



శ్రీరస్తు.

# బిల్హణీయము.



## తృతీయాశ్వాసము.

మహితరూపజితశత
కామా కామాంధకార గర్వోద్ధతను
త్రామారిమదనిషూదన
క్షేమాకరదివ్యనామ సీతారామా. 1

తే. అవధరింపుము తదనంతరావధాన
మహిమ బిల్హణకవితోడ మంజువాణి
యామినీపూర్ణతిలక విహారగరిమఁ
దనరు చున్నంతఁ జెలులు తత్కార్య మెఱిఁగి. 2

చెలులు కవిని రాజకుమారి కలయుటయెఱింగి రాజున కెఱిఁగించుట.

వ. ఇట్లు తమలోన. 3

క. ఓకమలనేత్రి వింటే
యీకవిసన్నిధిని సరసిజేక్షణ యెంతో
చేకొని విద్య గ్రహింపుచుఁ
గాక మఱియు నిపుడు కానికార్య మొనర్చెన్. 4

తే. ఇందు కేమందు మమ్మ యోయిందువదన
విభున కెఱిఁగింపవలెఁ గవివిభునినడత
మనకు దాఁచంగ నేటి కేసునఁగ వలసి
మీఁద నెటు వోయి యెటు వచ్చునో తలంప. 5

వ. అని తర్జనీకలితనాసాగ్రయై నుచుక్కు మనుచు రాజసాన్ని
ధ్యంబున కేతెంచి మ్రొక్కి యున్నంతఁ బ్రసన్నవదనుండయిన
యన్నరపాలుం గనుంగొని గద్గదకంఠయై విన్నపం బాకర్ణిం
పుఁ డని వారిలో నొక్కబోటి యిట్లనియె. 6

తే. రాజరాజేంద్ర మదనాభిరామనృపతి
దేవరకుమారి యాకవిధీరువలన
విద్య యభ్యాస మొనరించువేళ బద్ధ
కాండపట మంకుశము గాఁగఁ గపట మొదవె. 7

చ. ఎఱుఁగఁగ రాదుదైవకృత మెట్టిదియో మనమంజువాణి తా
గుఱిగొని యద్ధరామరునిఁ గూడినయట్టులు మాకుఁ దోఁపఁగా
గుఱుతెఱిఁ గీవిధంబు మది గోప్యముఁ జేసినహానివచ్చు నం
చఱిమిఱిఁ జెప్పవచ్చితి జనాధిప యేమిఁకబుద్ధి మీఁదటన్. 8

వ. అనిన విని యత్యంతకంపితస్వాంతుండై భూకాంతుండు
నిట్టూర్పు లెసంగఁ దనలో నిట్లనియె. 9

క. ఏ నొనరించుట యెట్టిది
యైనవిధం బేమి యాఱడాయెను భువిలోఁ
దా నొకటి తలఁప దైవము
మానుగఁ దలఁచు నొకటి యనుమాట నిజంబై. 10

వ. అని వితర్కించి వారలం బనిచి పుత్త్రికామణిసమీపంబునకు
వచ్చి నిలిచి యిట్లనియె. 11

రాజు తనకూఁతుసమీపంబునకు వచ్చి నీతులు పలుకుట.

శా. పట్టీ రాజకుమారశేఖరులఁ బిల్వం బంచి భూపాలకుల్
చుట్టా లందఱు మెచ్చఁగా నగరముం శోభిల్లఁగాఁ జేసి మే
ల్వట్టం దిట్టముగా స్వయంవరమునం భూషించి నిం బ్రేమనే
నెట్టో సేయఁ దలంచితిం పాదవఁగా నిచ్ఛానుకూలంబుగన్. 12

ఉ. కోరిన రాకుమారకునకుం బ్రియ మందఁగ నిన్ను నిచ్చి యెం
తోరహిఁ మీఱ సౌఖ్యమున నుండెద నంచుఁ దలంచియున్న నా
కోరుకు లెల్లఁ బోఁదలఁచి కొంకుఁ గలంకము లేని మత్కులం
బారఁగ దుర్యశంబు మహి నందఁగఁ జేసితి వమ్మ బాలికా. 13

వ. అని పలుకుచున్న జనకునిఁ జూచి పుత్రికామణి యిట్లనియె.

రాజపుత్రి రాజుతోఁ దాను దోషరహితురా లని చెప్పుట.

శా. అయ్యా యెన్నఁడు లేని వార్తలివి యేమశ్రాంతముం బల్కెదీ
వయ్యో నీ వానరించు కృత్రిమమొ నీయాత్మ వ్యథం జేయునా
త్రియాస్యాబ్జముఁ జూచితే మదికి సందేహంబుగాఁ దోఁచెనో
నీయాజ్ఞం దెఱ యంకుశంబుగదె నిర్నిద్రానుకంపానిధీ. 15

క. ఏమయ్యా యేమి వింటివి ?
యో మహిపా యెటులు దోఁచుచున్నది నీకుం
మామకచిత్తము దెలియదె
నామది సంశయము లేదు నవ్యవిచారా. 16

క. నీయాజ్ఞ లేని కార్యము
మాయయ్యా సేయ నోప మాయిరువురకున్
నీయెడ హృత్సంయోగం
బేయుక్తి ఘటించుఁ దెఱ హరింపఁ దరంబే. 17

క. అది గాక నాకు వ్రతము
న్నది యెఱుఁగవె యంధకుని మనంబున నైనం
బదపడి దర్శింపను నీ
మది నన్యవిచార మేల మానవపాలా. 18

వ. అనినఁ గరుణాయత్తచిత్తుండై రాజోత్తముం డిట్లనియె. 19

చ. తొడరఁగఁ బూర్వమేమయినదో యది పోవఁగనిమ్ము పుత్త్రినిన్
గడవఁగ లేను వంశము వికారము సేయక యింకనైన నీ
నడతలు మాని యుండు సుమనఃస్థితి సత్కులసూతి కెంతయు
య్యెడనొకరాకుమారునకునిచ్చెదనిన్నుఁగృపామతిందగన్. 20

వ. అనిన విని మనంబొప్పక శంకారహితచిత్తయై మత్తగజయా
న యిట్లనియె. అయ్యా, ఆకవికే నన్నిచ్చి యథావిధి వివా
హంబు నెఱవేర్చి నీకృపం జూపుము. నే నాయగ్రకులునికి
క్షత్త్రకన్యోచితవిధానంబున భార్య నైతి. 21

కాంత తనమనంబు కవియందాసక్తమై యున్నదనుట.

మ. ధరణీపాలవచించెదన్ వినుముచిత్తంబక్షులున్ ఘ్రాణముల్
వరజిహ్వాశ్రుతు లంచితం బయినసంస్పర్శంబు నాధీనమం
దు రతిన్ నిల్చెను బుద్ధిపూర్వకముగాఁ దోడ్తోడ నింకేరికిం
గరమైయిచ్చెదుచేతనారహితమీకాయంబునాయంబుగాన్.

వ. అనిన విని రోషారుణితాయతాక్షుండై నరాధ్యక్షుండు శీఘ్రం
బుగాసభాస్థలంబునకువచ్చి కుపితమానససింహంబుకరణిసింహా
సనాసీనుండై సభాసదులం గలయం గనుంగొని యిట్లనియె.

రాజు కుపితుండై సభాసదులతో నాలోచించుట.

తే. అమర నంతఃపురద్రోహ మాచరించు
వాని నే శాస్తి సేయంగ వలయు మీరు

ధర్మపద్ధతిఁ బలుకుఁడు తగినశాస్తి
సేయుదము వాని సద్గుణశ్రేష్ఠులార. 24

వ. అనిన విని సభాసదులు గలంగి మనంబున ఘనంబుగాఁ జోఁచి
యాలోచించి యిట్లనిరి. 25

క. కార్యాకార్యము లెఱుఁగక
మర్యాదలు నడపువాని మహిపతి యెంతే
నార్యానుమతిని హింసవ
ధైర్యా దండింపవలయు దండధరుండై. 26

వ. అందు నొకఁ డిట్లనిరి. 27

క. ధరణీశ విచారించిన
ధరణీతలమందు నన్ని తప్పులె చూడం
గరుణించి కావవలయును
బరికింపఁగ నెట్టులైన భవ్యవిచారా. 28

వ. అనిన మఱికొందఱిట్లనిరి. 29

ఆ. లేఁత మూదు రెఱింగి నీతిఁ దండింపఁగా
వలయుఁ గొన్ని మాన వచ్చుఁ గొన్ని
మానఁ దగవుఁ గొన్ని మహిమీఁద ధరణీశ
యెంతకార్యమైన నిదియ హితము. 30

వ. అనినఁ గొందఱు రాజభావం బెఱింగి యిట్లనిరి. 31

క. ఏకార్యమైన మానవ
లోకోత్తర యమునిరీతి లోకంబున నా
లోకించి దుర్జనావళిఁ
గైకొని దండింప కున్నఁ గలుషము వచ్చున్. 32

వ. కావున శిక్షాకరణంబు కర్తవ్యం బనిన విని రాజు కోటపాల
కులం బిలిపించిన. 33

సీ. గండ్రగొడ్డండ్లు గొంగళ్లును జికిలిచ
ల్లాడముల్ మైలచల్లాడములును
గుఱుతుచుంగులతలగుడ్డలుఁ గావు బొ
ట్లినుపకడేలుఁ దాళ్లినుపదుడ్లు
నీలికాసెలు మెడనీలికుచ్చుల త్రాళ్లు
బిరుదైనవడిసెలల్ బిల్లమొట్లు
కాఱుమేనులు బలుకోఱమీసములును
బిగివంపుచూపులు బెట్టుగుడ్లు
తే. నొడలఁ గోరోచనపుఁబూఁత లుట్టిపడఁగ
వచ్చి తలవరు లెల్లను మెచ్చు దొరయ
నిలిచి చేతులు మొగిడించి నేర్పుతోడ
దండ మిడి తోరమై యున్న ధరణివిభుఁడు. 34

వ. అందు వీరసేనుం డనునొకతలారినిం జూచి యిట్లనియె. 35

—— రాజు బిల్హణునికి శిరచ్ఛేదం బాజ్ఞాపించుట. ——

శా. ఓరీ బిల్హణనామధేయకవి నుద్యోగించి రాఁ దీసి దు
ర్వారస్ఫూర్జితదీర్ఘ పాశములచే బంధించి కొంపోయి బల్
దూరం బయినస్మశానవాటిముఖ మాలోకింపకన్ నిర్దయా
ధారస్వాంతుఁడవై తదీయశిరముద్దామాప్తి ఖండింపుమా. 36

వ. అని ముష్టాఘుఁ బలికి పొమ్ము పొమ్మని సెల వొసంగిన
వీరసేనుం డిట్లనియె. 37

క. కోపముచే శిక్షింపను
భూప యనుగ్రహముచేతఁ బ్రోవఁగ దక్షుం

డేపట్ల నృపతి వసుమతి
నీపద్ధతి నరసిచూడ నితరము గలదే. 38

క. దేవర యేమి వచించిన
నావిధమునఁ జేతు నేను నది యెట్టిదొ మీ
భావము యోగ్యా యోగ్యవి
భావముఁగా గానవలయుఁ బరహితబుద్ధిన్. 39

వ. అని పల్కిన భూపాలుండు కోపించి యావలిమొగం బయిన
వీరసేనుండు. 40

క. భూపాలుఁడు సెప్పిన వినఁ
డాపాపము పుణ్య మంత యవ్విభునిదె తా
రూపించినట్లు సేయుదు
నీపట్టున దైవయోగ మెట్లున్నదియో. 41

వ. అని తద్గ్రహంబుఁ జొచ్చి. 42

తే. పుస్తకము చేతఁ బూని తత్పూర్వకార్య
మెఱిఁగి తనలోన సతి భజియించువాని
నొదిఁగి శయ్యాస్థలంబున నున్నవాని
బిల్హణునిఁ జేరి తలవరి బెగడ ననియె. 43

క. ఓకవిరాజశిఖామణి
నీకొక విన్నపము సేతు నృపవరుఁడు నినుం
జేకట్లు కట్టుకొని చని
యాకడ దండింపు మనుచు నాజ్ఞ నొసంగెన్. 44

తే. దేవ నీపట్ల యిది యేమొ తెలియరాదు
చెప్ప నెంతయు వినఁడామె శీఘ్రగతిని
లె మ్మనుచు డాసి వాఁడు చేఁదమ్మి పట్టి
తిగిచి యురుపాశములను బంధించె నంత. 45

తే. కవివరుఁడు లేచి దిక్కులు కలయఁ జూచి
మంత్రదేవతఁగా నారమణి నిజాత్మ
నిలిపి తలవరివెంబడి సిశ్చలమతిఁ
జనియె నచ్చటిజనములు సందడింప. 46

వ. అప్పు డక్కసఖి త్వరితగతింజని రాజపుత్త్రితో నిట్లనియె. 47

రాజపుత్త్రి కవియవస్థను సఖివలన నెఱింగి తండ్రిం జేరి యడిగికొనుట.

శా. అక్కా బిల్లణుఁ గోటపాలకులు ప్రాజ్యస్ఫూర్తిదుర్వారులై
చిక్కంబట్టినుహోగ్రపాశముల నాక్షేపించుచుఁ బాహువుల్
ప్రక్కల్ ప్రక్కలు మొక్కలంబుగ వెసన్ బంధించుకన్నట్టియీ
చక్కిం బోవుచునున్న వారిదె సఖీ శక్యంబె వీక్షింపఁగన్. 48

వ. అనుపలుకులు చెవులకు ములుకులు సోనిపినట్టివి యైన హాహా
కారంబునొంది యిందుకు నెక్కార్యంబని విచారించిదిగ్గున లేచి.

చ. నడుమసియాడ నెమ్మొగమునం జెమటల్ జనియింపఁ బాదము
లడఁబడఁ బైఁట జాఱఁ గనుఁదమ్ముల నీరు దొలంక వేణియు
న్విడివడి దూలియాడ నవనిం బడి లేచుచు నెల్లుతోడ న
ప్పడఁతుక సేర వచ్చెను సభాస్థలి రాజసమీపభూమికిన్. 50

చ. కుటిలత రాహు వేర్చి తనకోఱలఁ బాదుగనొక్క మిక్కిలిన్
జొటచొటగా సుధారసము జొబ్బిలుచున్న శశాంకురీతి న
చ్చటులవినీలకుంతలవిశాలవిలోచన పాళి నీర ము
త్కటముగ దూకఁగా వదనకంజము విన్నఁదనంబుదోఁపఁగన్.

క. నాతండ్రీ యీవిధమునఁ
జేతురె గతజలమునకును సేతు వదేలా
చేతమునఁ దలఁపుమా కవి
చేతోవిభుఁ డన్యు నొకనిఁ జేపట్టెదనో. 52

క. అది గాక బ్రాహ్మణో త్తముఁ
డౌదవును దోషంబు నీకు నుర్వీశుఁడ వే
మిది రాజధర్మ మగునే
పదపడి ప్రోచుటయు మేలు ప్రజలు నుతింపన్. 53

ఆ. భవ్యుఁ డతనివలనఁ బాప మింతయు లేదు
కాముపీడితాత్ముఁ గాన నేను
గదిసి దోష మతనిఁ గట్టికొంటిని నన్ను
నాజ్ఞ సేయ వలయు నతని వలదు. 54

క. ఈజగతిఁ గాంధర్వము
రాజకులజకుఁ వరము; ధరాసురుబుధు నా
యోజఁ నేను వరించుట
రాజా నీకులము నుద్ధరణ సేఁత కదా. 55

క. అటు గాక పోయినప్పటి
కిట నుంపక మమ్ము నొక్కయెడ నుంపవె యు
క్కట దృష్టి మాని తండ్రీ
యిటువలెఁ జేయంగఁదగ దహీనవిచారా. 56

క. ఇదియును గూడకపోయిన
నొదవఁగ మఱి యొక్కయూర నుంపుము దగ మ
మ్మది గా దంటే మఱియొక
పదమున కీదేశ మెడలఁ బంపుము తండ్రీ. 57

తే. నిగ్రహానుగ్రహములకు నృపుఁడు దక్షుఁ
డరయ నిందు నకార్యకార్యములు లేవె
యెన్ని యండిన బ్రాహ్మణు నేచరాదు
'బ్రాహ్మణాః భర' యనియెడుపలుకు వినవె. 58

వ. అని దీనాలాపంబుల నబ్బాలామణి విలపించుచు మఱియు
మఱియుఁ బలికినవై శ్వానరునియందు ఘృతంబుఁ జిలికినచం
దంబున నుండిపడి ప్రత్యుత్తరం బియ్యక విముఖుం డయినఁ
గంబుకంఠు రాజువలనఁ దిరస్కృతయై యాస్థానంబు వెడలి
పోవుచు ని ట్లనియె. 59

సీ. తండ్రి నాపయి యింతిదయ నింపఁ డాయెఁగా
డాయఁగాఁ బోయి నే దండ మిడినఁ
దల్లి యడ్డపడి తా దప్పింప దాయెఁగా
దాయెఁగాఁ దలచెనో తనయ యనక
నాళీజనశ్రేణి కాత్మ నిం పాయెఁగా
పాయఁగా రాని యీపాటు విన్నఁ
గలవారికెల్లఁ గన్నులు చల్ల నాయెఁగా
నాయ గాథంపుఁజందంబుఁ గన్నఁ

తే. గటకటా యెవ్వరైన నాకష్ట ముడిపి
ప్రోవలేరైరి లేరైరి భూతదయులు
నేమి సేయుదు నే మందు నెందుఁ జొత్తు?
ననుచు వగచుచుఁ గవిమార్గ మనుసరించి. 60

కాంతామణి కవినిఁగూర్చి విలపించుట.

ఉ. హా కవిరాజరాజమణి హా నవమోహన హా మనోహరా
హా కరుణాగుణాభ్యుదయ హా రమణీనవపంచసాయకా
హా కమనీయగాత్ర యొకరైన నినుం గృపఁ బ్రోవరైరయో!
యీకడ్డినీవు దైవమున కేమివిరోధము సేసితో కదా. 61

సీ. వికటదుస్సహమహావిషము కంఠంబున
దాక్షాయణీశుండు దాల్ప లేదె?

సతతదుర్వారవిస్ఫులింగశిఖాంబడబాగ్ని
జలధియంతరమున నిలుపలేదె?
సకలచరాచరజంతుజాలము నెల్ల
నేర్పడఁ బుడమి వహింపలేదె?
పృథివీతలం బెల్లఁ బృష్ఠభాగమునందు
మొగిఁ గూర్మనాథుండు మోవలేదె?

తే. యంతకన్నను గవివరునందుఁ గలదె
దోషభర? మెవ్వరైనను దొడరి ప్రోవ
రయ్య భూపతి వినఁ జెప్పరయ్య కరుణ
నింపరయ్య నా వెత నివారింపరయ్య. 62

సీ. మోహించి గౌతమమునిసతిఁ బొందిన
పురుహూతు నమరులు ప్రోవలేదె
గురువధూగమనంబుఁ గోరి చేసినచంద్రు
నీశుండు మౌళి వహింపలేదె
కడిమిమైఁ గూఁతును గనిపొందఁ గోరిన
పరమేష్ఠి శౌరి చేపట్టలేదె
స్మరవశుండై సీతచనుదోయి గీఱిన
కాకిని రఘుపతి గావలేదె

తే. యంతయును ద్రోహ మీతనియందుఁ గలదె
నేను గోరిన విప్రుండు గాని యితర
వంశజుఁడు గాఁడు ధర్మంబువరుసఁ జూడఁ
బుణ్యు లెవరైన నీకవిఁ బ్రోవరయ్య. 63

వ. అని మఱియు నిట్లనియె. 64

ఉ. ఆకవిరాజుఁ గోరివ తన కయ్యెడుఁ గాక యటంచు నాసతీ
లోకశిరోవిభూషణము లోలత దిక్కులు చూచి తెంపుమై
రాకలుఁ బోకలుం గలుగు రాజులనార్యులఁ గాంచియెంతయుఁ
శోకముఁ గోపిలజ్జయయి సోలుచు వ్రాలుచుఁ బల్కె నిట్టులన్. 65

సీ. ఎక్కుడుగా మది నెంచి పండితహంస
నాదరింపరె చతురాస్యులార
కారుణ్యమున గతి గల్పించి ద్విజరాజు
భరియింపరే చక్రధరణులార
నిరుపమసత్కళానిధిని మన్నింపరే
తల యొడ్డి రాజవతంసులార
విదితనిరాధారు విబుధేంద్రు నిలుపరే
యిర వొంద భూరిధరేంద్రులార

తే. సుకవితాపంబు దీర్పరే శూరులార
బ్రహ్మకులజునిఁ దేరె గోపాలురార
ధర్మగతిఁ బూని రాజకందర్పులార
నామనోహరుఁ గూర్పరే నాయ మెఱిఁగి. 66

సీ. చాతకంబుల దయచాతఁ గంబు లొసంగి
బ్రోచునాఘనురీతిఁ బ్రోవరయ్య
కోరికల్ దీరఁ జకోరికల్ మీఱఁగాఁ
బ్రోచునాశశియట్ల బ్రోవరయ్య
రసజాతమెసఁగ సారసజాతములఁ దగఁ
బ్రోచునారవిభాతిఁ బ్రోవరయ్య
సుమనోవిభులనెల్ల సుమనోవిశాలుఁడై
బ్రోచునాహరిమాడ్కిఁ బ్రోవరయ్య

తే. తల్లిప్రజలను గలయుంగఁ దల్లిప్రజలు
ప్రోచువిధమున మమ్మును బ్రోవరయ్య
పాపరహితాత్ములై వెతఁ బాపరయ్య
ధన్యులార కృపాళుమూర్ధన్యులార. 67

సీ. ఘనులార దురితలంఘనులార గావరే
యామహేశునిఁ బోలునీమహేశుఁ
బతులార మతిబృహస్పతులార గావరే
యాబుధేంద్రునిఁ బోలునీబుధేంద్రు
ధనులార సుగుణవర్ధనులార గావరే
యాకళాఢ్యునిఁ బోలునీకళాఢ్యుఁ
గృతులార కలితోపకృతులార గావరే
యాద్విజాంకుని బోలునీద్విజాంకు

తే. జ్ఞానభోగదయాసారగరిమఁ గాంచుఁ
గాంచి యీకవి మన్నించి కావరయ్య
పెంపు గనరయ్య నామొ రాలింపరయ్య
యెంచఁగదరయ్య ధర్మమార్గించరయ్య. 68

క. తమ్ములకుఁ గీడు సేయు న
ఘమ్ములు గలరాజు లెల్లఁ గాతురె పరులఁ
నమ్మఁ దగరు దోషాకరు
లిమ్మహిఁ దలపోయ నింక నేమన నేర్తున్. 69

సీ. సుమనోవిభూతివిస్ఫూర్తి గన్వారికిఁ
జెలఁగి యీబుధుని రక్షించు టెంత
కృతధర్ములై సత్వగతిఁ గాంచువారికి
నీధర్మమతి భరియించు టెంత

భువనాధినాథులై పొలుపొందువారికి
నీద్విజాధీశు వహించు టెంత
యజ్ఞారిధరునిసఖ్యము సేయువారికి
నితనిఁ గృతార్థుఁగా నెన్ను టెంత
తే. కాన నీకవి శుద్ధాత్ములైనవారు
పుణ్యజను లైనవారును భూరిసత్త్వు
లైనవారును సర్వజ్ఞు లైనవారుఁ
బొలుపడి ప్రోవఁ దగు లోకపాలురార. 70

సీ. మాకంద గానవే మాకందముగ రతి
చ్ఛాయ లిచ్చితివి నుచ్ఛాయ లొసఁగి
పురుష గానవె మహాపురుషసంగతియుఁ గా
వించితి వపుడు భావించి చూడఁ
బనస గానవె తల్లపనసరోజము చూడ
నొనరించితివి మాకు నొనరఁ జూపి
క్రముక కానవె శుభక్రముకగార్పితకుచ
పాళిఁ జేసితివి నీపాళి నన్ను
తే. నాఁటిప్రేమ మనంబున నాటి యంతఁ
జూపవలె నేఁడు నాకవి జూప నరయ
ఘనతరులు మీరు గాన నే ఘనత సేతు
ఘనతరుఁ డతండు మీకు లంఘనత దగునె. 71

సీ. మానసోల్లాసి యై మన్నించునాకవి
హంస గానరె రాజహంసలార
సహకారశాలి యై సంగతుల్ గాంచుమ
త్ప్రియునిఁ గానరె వనప్రియములార

యతులసదారసస్థితిఁ జెలంగెడుశుభ
వ్రతునిఁ గానరె మధువ్రతములార
యధికఫలోదయావాప్తి గాంబుధతిల
కంబుఁ గానరె శ్రీశుకంబులార
తే. ద్విజవరుఁ డతండు నుత్తమద్విజులు మీరు
గాన మిమ్ముల నడిగెదఁ గాన నేను
బక్షపాతులు మఱియు సత్పథవిహారు
లెచట నున్నాఁడొ నా కెఱింగింపవలయు. 72

వ. అని బిల్హణు నుద్దేశించి ముద్దియ యిట్లనియె. 73

మ. అరవిందంబులరీతిఁ జెన్నలరునీహస్తంబు లెట్లోర్చె ము
ష్కారిగాఁ బెన్చినకాలపాశములకుఁ ముగ్ధాంగనాగానభ
స్స్వరసోత్కర్షములయిననీశ్రుతియుగం బత్యూర్ధ్వతోర్వ్వపకిం
కరవాదార్భటి కెట్లు దాఁగె మదనాకారా మనోనాయకా. 74

వ. అని యిట్లు పొగిలి పొగిలి. 75

తే. తరుణి నగరంబు గడచి పోఁ దలఁచి యున్న
నున్నతాకారు లచ్చట నున్నవారు
వారణము సేయ నంతఁ దద్ద్వారసీమ
సీమవా రెల్లఁ జూడ వీక్షింపుచుండె. 76

### పౌరజనపరస్పరవాక్యములు.

వ. ఆసమయంబున నగరజనంబులు తమలోనఁ దా మిట్లనిరి. 77

సీ. అవనీశ్వరుఁడు నమ్మి యంతఃపురంబులోఁ
జేర్చిన నెంతయుఁ జేసె నితఁడు!
కన్య నీవిధమునఁ గలుపాత్ముఁడై రతిఁ
గలసె దానికి నింక గతియు నేమొ?

యెంతపనికిఁ జొచ్చె నీభూసురాధముఁ
డేర్పడ నిది బైట నెట్లు పడియె
దాఁగునా యిట్టిది ధరణీశుఁ డెంతయు
జేసె నిర్వ్వరకు వీక్షింపకుండ

తే. విప్రుఁ డెక్కడ మేదినీవిభునిపుత్రి
కలయు టెక్కడ యిది చూడఁ గడిఁదివింత
చెలఁగి చేసినవారికిఁ జేసినంత
యనుభవింపక తీఱునా యవనిలోన. 78

క. ఏకాంతంబున నుండిన
లోకములోఁ దలఁప నెట్టిలోకులనైనన్
డీకొలుపు బుద్ధి సతిపైఁ
బ్రాకటముగ వారి ననఁగఁ బనియేమి యిఁకన్. 79

ఉ. చక్కనివారిలో మిగులఁజక్కనిదానిఁ గవీంద్రమౌళి యా
చక్కెరబొమ్మ యట్టిదె విచారము లేటికిఁ జూచునంతలోఁ
జక్కెరవింటిజోదు రభసమ్మునఁ దూపులు వింటఁగూర్చి బల్
చిక్కులఁబెట్టకుండునె వచింపఁగ నొంటిగ నుండువేళలన్. 80

చ. కటకట యెట్లు భూసురునిగాసియొనర్పుఁ డటంచుఁ బంచె న
క్కుటిలుఁడు భూమిపాలుఁ డిదికూడదు చెప్పఁగ నేరికైననిం
తటికిని దైవయోగము కదా తలపోయఁగ వానిభాగ్య మి
ప్పటి కిటు లుండె నిట్టిపని ప్రాజ్ఞుని కెచ్చటనైనఁ బాడియే. 81

చ. ఇల నిఁక వీనిఁ బట్టి వధియించిన నీసతి మేనఁ బ్రాణముల్
నిలుపదు దానికిన్ జనని నిల్వదు భూవరుఁ డంతట న్మదిం
దలఁపఁగ నేమియగునో యట దారుణ మేవిధమౌనొ యింతకుం
జలము జెడి భూవిభుండు కవి సన్మతిఁ బ్రోచిన నన్ని చక్కనౌ. 82

వ. అని యిట్లు వేలువేలుగుంపులు గట్టి పలుకుచున్న నొకకొంద
ఱిట్లనిరి. 83

క. చోరుఁ డనునామ మీకవి
కారయఁగను నేఁటికిని యథార్థం బయ్యెన్
జారుఁడు మఱి రెండుం దగె
శూరులు మెచ్చుదురె జారచోరత్వంబుల్. 84

వ. మఱికొంద ఱిట్లు పల్కిరి. 85

క. ఏమిం దోసంగె క్షత్రియ
కామిని గాంధర్వమున మగనిం గైకొనినన్
ఈమహారాజర్షి సుతల్
భూమిసురలఁ బెండ్లిఁగొనుట పోఁడిమియకదా. 86

వ. అనుటయు నక్కాంతాలలామం బక్కవివరునిం జూచి యి
ట్లనియె. 87

ఉ. హా కవిరాజచంద్ర మదనాంచితవిగ్రహ నన్ను నిప్పుడ
స్తోకవియోగవారినిధిఁ ద్రోచి చనం దగ వౌనె నీకు న
ద్యూ కరుణాంబురాశి వని యుల్లమునం దగనమ్మియుంటి నీ
వేకత మెట్టు లేఁగెదు రహింగన గూడిన మేలు సెల్లదే. 88

వ. అని విలపించుచున్న మార్గంబునం బోవుచుండి విని బిల్హణుండు
దోధూయమానమానసుండై తిరిగి చూచి యిట్లనియె. 89

బిల్హణుండు కామినింగూర్చి పలుకుట.

ఉ. హా కమలాయతాక్షి చెలి హా సరసీరుహకుట్మలస్తనీ
హా కమనీయగాత్రి సతి హా నవమోహిని హా వధూమణీ
హా కనకాంగి నేను విడనాడితి నంచుఁ దలంచె దీవు నీ
లోకమునందు జీవునకు లోలత గాక స్వతంత్రమున్న దే. 90

ఉ. ఓరమణీమణీ వికసితోత్పలపత్రవిశాలనేత్ర న
న్నారక యేల చూచెదవు ద్వారనివాసిని గోల దేవతా
వారవధూటికానయనవాగురికావలయంబునందు దు
ర్వారతఁజిక్కి తామగిడివచ్చునె బిల్హణుఁ డెన్నిభంగులన్. 91

వ. అని పలుకుభూసురవరునిఁ దలవరు లురుగతిఁ బదమని శ్మశా
నవాటికిఁ దోడ్కొని పోయి యొకవటవృక్షంబు క్రింద నిల్పిన
బిల్హణుండు నలుదెసలం జూచి తల్లడిల్లినయుల్లంబుతో మంద
స్మితవదనారవిందుం డై వీరసేనున కిట్లనియె. 92

క. ఓతలవరి నేడ నేటికి
నాతతనిశితాసిఁ గొని ధరాధీశునియా
జ్ఞాతంతె మునను బిల్హణు
వే తెగ వ్రేయుము శిరంబు విశ్వము మెచ్చన్. 93

వ. అనిన విని వీరసేనుం డి ట్లనియె. 94

క. కవిరాజవర్య నీ విపు
డవిరళగతి నించుకైన నాత్మ భయంబుం
దవులక దరస్మితాస్యుఁడ
వపుటకుఁ గత మెద్ది సెప్పు మమలవిచారా. 95

వ. అనిన బిల్హణుం డి ట్లనియె. 96

చ. హితమతిఁ జెప్పెద న్వినుము హీనగుణాకర వీరసేన యా
క్షితిరమణాత్మజాత సరసీరుహలోచన మంత్రదేవతా
కృతియయివేడ్క నాహృదయగేహమునందువసించి జోడుగా
సతతముఁ బాయకున్నది విచారము లేటికి దైన్యమేటికిన్. 97

వ. అని మఱియు ని ట్లనియె. 98

చ. కలికివధూమణీ స్మరవికస్వరచారురుచీ గుణాకరీ
జలరుహలోచనీ జలదచంచలవేణి సుధాకరాననీ

సలలితతుంగపీనకఠిన స్తనమధ్యగహారభాసురం
దిలసుమనాసికన్ మదిని దేవతఁగా స్మరియింతునెంతయున్. 99

తలవరి కవిని ఖండింపక యుంచుట.

వ. అని తదేకాయత్తచిత్తుండై నకవివరునిం జూచి ఖండింపఁ జేతులు రాక హృదయబహుజనప్రాణం బగుకృపాణంబు నేలంబడవైచి వీరసేనుం [illegible] నుండై నిలువంబడి యున్నతదనంతరంబ యవ్విప్రుం [illegible] రాజపుత్త్రిని హృదయంబున నుపలక్షించి యిట్లనియె. 100

కవి కామిని హృదయంబునఁ బలువిధంబుల స్మరించుట.

చ. పరమసువర్ణచంపక [illegible] సురగౌరి సురోమరాజి ని
ద్దురఁగొని మేలు [illegible] ద్రోయరుహాంబక విహ్వలాంగిఁదా
మరసదళాయ [illegible] ప్రమాదవశంబునఁ బోవు విద్యవై
ఖరి మదిలోన [illegible] దలిర్పఁగఁ జింతఁ జేసెదన్. 101

మ. విలసత్పంకజ [illegible] యై పెంపొంది గోరోచనా
తిలకోదంచిత [illegible] సద్దివ్యల్లలాటంబు నై
లలినొక్కింత [illegible] బుచే [illegible] సలీలాఘూర్ణదృక్పాత నై
చెలువా [illegible] మునన్ నిలుచునా చిత్తంబుయుక్తంబుగాన్.

చ. శ్రమజలసాంద [illegible] సారపుమౌక్తికరాజివై ఖరిం
గొమరు సెలంగ హేమమణికుండలదీప్తుల గండభాగముల్
రమణ రహింప [illegible] పరిరత్యనుభూతినియోగ మంది చె
ల్వమరుతదా [illegible] నాత్మ భజించెద నిశ్చలుండనై. 103

ఉ. పున్నమనాఁటి [illegible] బోలుమొగంబును మొల్కచన్ను
లున్,సన్నపు [illegible] న ము చాయలు దేఱినమేనుసొంపు నా
కన్నియరూపు [illegible] గాంచితినేని మనోజసాయకా
గ్నిన్నె [illegible] నిన నెమ్మెయినెమ్మదిఁ జల్లఁజేయుదున్. 104

ఉ. ఏవిధిఁ గాంతు నారమణి నే నొకరాతిరి తుమ్మినన్ 'జిరం
జీవ' యటంచుఁ దచ్ఛుభవిశేషవచోవిభవంబు మాని రో
షావహచిత్తయై పలుక కందపుఁగమ్మ ఘటించెఁ గర్ణమం
దావినెనామదిన్మెదలి యాడుచునున్నదిగా ఘనంబుగాన్.105

ఉ. ఉన్నతచారుపీవరపయోధరభారముచేత ఖిన్నయై
చెన్నగునూత్నయౌవనముచేఁ దనరారుసుధాకరాననన్
గ్రన్ననఁ గౌఁగిలించి వదనంబుముదంబున ముద్దువెట్టుదున్
వన్నియమీఱ మత్తమధుపంబు సరోరుహమానుకై వడిన్.

ఉ. మానిని విస్ఫురత్కమలమంజులపత్త్రవిశాలలోచనన్
పీనకఠోరతుంగకుచభృంగగరుద్రుచినీలవక్రస
న్మానితకోమలాలకసమాననరాకృతిఁ గాము దేవతన్
దాని గుహాపదేశముపిధంబున ధ్యానము సేతు నాత్మలోన్.

మ. నెరివాల్ చూపులు మొల్లక్రొవ్విరులకాంతిం జెందుపల్జాడసుం
దరమై తేనెలు జిల్కుమోవి గలయాతన్వంగివక్త్రాబ్జ మీ
ధరణిన్ సాధుపరోపకారము మదిన్ దల్చుం గృతఘ్నుంబలె
న్నరయ న్నామదిమఱ్వ నిప్పటికి నత్యంతానుభావ్యుండనై.108

ఉ. దీటుసెలంగఁ బంచశరదివ్యధనుర్గతమత్తభృంగరా
ట్కోటిగరుత్ప్రభారుచిరకోమలకర్బురితాలకంబులన్
నీటగుదంతపత్త్రముల నీలసరోరుహభూషణంబులన్
లూటిగ దానిమోము మదిలోఁ దలపోయుదుమాటిమాటికిన్.

శా. తెల్లంబై చిఱునవ్వు వెన్నెలలచేఁ దేల్పొప్పులేఁ జెక్కులున్
మొల్లంబై తగుచంచరీకములగోముం జెందుకన్దమ్ములం
బ్రోల్లీలాంకశరత్సుధాంశురుచినొప్పున్ భామనెమ్మోము నా
యుల్లంబుం జివురింప నిప్పటికి నే నుప్పొంగి వీక్షించెదన్.110

చ. దరముహాసించుకంధర ముదారత నంచికరాంబుజాతమున్
వరకటిసంఘటించి జడ వామభుజంబున గబ్బిగుబ్బచ
న్నొరయ వహించి నిల్వఁబడి యూరక నన్ను ననేకరీతులఁ
వరమతిఁ జూచు నత్తరుణి వర్ణన సేసెద నే ముదంబునన్.111

ఉ. నే నపరాధినై యడరి నేర్పునఁ దత్పదపంకజంబులం
బూనికతోఁ దలం బడినఁ బోవఁగఁ ద్రోచి చరించుచున్న న
ద్దానిచెలంగు నట్టిన నుదాత్త నిగ్గక కోప మయ్యెడన్
మానక యున్న దాని వరమానిని నాత్మఁ దలంతు నెంతయున్.

చ. సరిగొని నేల నేలుపువిశాలనితంబము లొప్పుదాని మే
ల్సొనసులలోఁ దుఁగాంచి బలుసన్నుతముం గనునాభిదాని మ
న్థరగతి గల్గుదానిని మృణాళసమానవిలాసబాహువుల్
బరఁగినదాని నెన్నెదను భావమునం దనుమధ్య నెప్పుడున్.

ఉ. అప్రతిమానబోధసురతాంతమునందు నిమీలితాక్షియై
కప్రపుఁదావి మాటికిని గ్రమ్మఁగ నూర్పులవేఁడి వాడి గం
డప్రరుచిఁ శ్రమాంబువులు దార్కొనిరాలఁగ నొప్పుదాని నే
నా ప్రియురాలి నోము సుమనఃస్థితి నిప్పటికిం దలంచెదన్.114

ఉ. నా యెడ నొక్క మాటయు మనంబున భావనచేసి మాటికిన్
డాయక నంతరంగమున దానరికట్టుకకోపభావయై [గాఁ
యాయత బాష్పకంఠ యయి యప్పటి యూర్పుల మోవి గ్రాఁగఁ
జేయఁ దొడంగె రోదనము చింతన సేయుదు దాని నెంతయున్. 115

శా. ఏకాంతంబున నొక్కనాఁడు గృహమం దెవ్వారు లేకుండఁగా
నాకం జేకుఁగ దర్పణంబుఁ గొని వీతౌసక్తి నుండంగ నే
జోక న్వెన్క వసింప నత్ప్రతిమయుం జూపట్టవే సిగ్గుతో
నాకంపించి భ్రమించి మించె మదనోద్యన్మానసాంభోజయై.

చ. మఱియు సుగంధయుక్తమయి మంజులమై తగుమోముఁద
మ్మిపైఁ, గిరిగెడుగంధలుబ్ధ మగుతేఁటిగమిం గనుదోయి
మాటికిం, దెఱచుచు మూయుచు న్మొగము ద్రిప్పుచుఁ గేలిన
రోరుహంబుచేఁ, దఱుముచు నొప్పునప్పొలఁతి ధ్యానము
సేసెదనిట్టివేళలన్. 117

మ. ఒకనాఁడొక్కెడ శ్రోణిపై వలువ జాఱుండంగ నే నంతలో
నకలంకస్థితిఁ బోవ సిగ్గుపడి యాహా యంచు దా విహ్వలాం
గకయై భీతిని నొక్కచేత మదనాగారంబు వే మూసి వే
రొకచేఁ బొక్కిలిగప్పు నప్పడఁతి నేనూహించి ప్రార్థించెదన్. 118

చ. అటు నిటు ముందు వెన్క బహిరంతరసీమల నన్నిదిక్కులన్
స్ఫుటతరకాంచనాంబురుహశోభితమంజులసుందరాస్య యై
తటుకున వాలుఁజూపులను దా ననుఁజూచుచు సంచరించున
చ్చటులవిలోచనన్మదిని సన్నుతి సేసెద నేఁ బ్రియంబునన్. 119

శా. ఆకర్ణాంతములై మదాలసములై యజ్ఞోపమానంబులై
శ్రీకల్యాణములై రమావరసుఖోద్రేకంబులై యొందవా
స్తోకాంశుప్రతులై ఘనవ్రత విభాశోభాయమానంబులై
యాకంజాక్షి విలాసనేత్రములు నాస్వాంతంబునందొప్పెడున్.

చ. సమయు మెఱింగి నేఁ దలుపు చాటుననుండఁగఁ గేలుఁ దమ్మి
మో, హమున మొగంబునం దిడి ముదాగమనంబుఁ దలంచి
చూచుచుం, గ్రమమున మత్కలాంకపదకాండములన్ మృ
దుగీతిఁ బాడుచున్, రమణి మనోవికాస యయి రాజిలు దాని
మదిన్ భజించెదన్. 121

చ. కలువలఁ గేరుకన్నులను గాటుకరేకలు దీర్చి చెక్కులం
దలరఁగ జందనంబలఁది యాపయిఁ గస్తురికొంతపూసిమేల్

తిలకము దిద్ది ముత్యములదీ టగుపాపటబొట్టమర్చియు
న్నలికులవేణిముద్దుమొగ ముబ్బుసిగాఁ దలపోయు చెంతయున్.

మ. కొనగోళ్లన్ బిగిగుబ్బల్గా త్రిసరులుం గూడంగఁ జేపట్టియున్
మొనపంటం జిగురాకుమోవిఁ గొన మోము న్నాటి రోషాత్మయై
కనుఁదమ్ముల్ మొగిడించి యుస్సురని సీత్కారంబుఁ గావిం
చుచున్, ననుఁ గోపించువధూటిమోము మది సన్మానంబు
గావించెదన్. 123

చ. స్మరజనకంబులై యమృతసారములై శ్రుతిరంజనంబులై
యరయ మృదూత్తరంబులయి యందములై మదికిం బ్రియం
బులై, కెరలుచు నోష్ఠపృష్ఠపరికీర్ణశుచిస్మితసంయుతంబులై
పరఁగు నెలంతవాక్యములు పట్టుగ శోభిలు నామనంబునన్.

చ. తనరఁగ నామదిం దరళతారనిమీలితలోచనంబులై
యనుపమలిప్తచందనరసాహితపాండురగండభాగమై
ఘనమృగనాభికాకుటిలకల్పితపత్త్రలతాభిరామమై
యనువగుసుందరీమణిముఖాబ్జము నిల్పెద వేడ్క మీఱఁగన్.

చ. మఱియును గర్ణపాళిఁ సమంచితకాంచనకుండలంబులన్
మెఱయఁగ గబ్బిగుబ్బ చనుమిట్టల ముత్యపుఁ బేర్లు రంజిలం
బిఱుఁదులఁ గాంచి యొప్పమురిపెంబున నందెలు మ్రోయవ
చ్చునా, మెఱుఁగుమిటారి నెన్నదఁ జుమీ మది నిప్పటికిన్
హితంబుగాన్. 126

ఉ. సందిటిదోయి నామెడను జక్కఁగ నిల్పుచు నిక్కి మిన్నలై
యందములై చెలంగుతనయబ్బురపుబ్బు మెఱుంగుగుబ్బలం
బొందుగ నాయురంబునను బూన్చి మొగంబున మోముఁ జే

ర్చి నన్నుం దగఁ జూచు నెచ్చెలి మనోనాగమూర్తిఁ దలంచి
చూచెదన్. 127

చ. కుచములు భుజాగ్రభాగమునఁ గూడి నటింపఁ గళంబు లీలమై
నొరగఁగఁ బెట్టి రెక్కబిగినొయ్యనఁ గాంచులు జీరువాఱఁగా
మెఱుఁగుమిటారిగుబ్బ లెలమిం గనుపట్టఁగ నన్నుఁ జూచున
గ్గరితయ రాళదృష్టు లెదఁ గాంచు దలిర్పఁగఁ దేజరిల్లెడున్. 128

చ. అలరఁగఁ గోమలారుణకరాంగుళముల్ కలపైఁ ఘటింపుచో
వలయముగా భుజాలతలు వంచి దృఢాంగవివర్తనంబులన్
వెలయుచు నుండఁగా సపరి నేమ సుధాకర కాంతి నొప్పున
ప్పొలఁతుక మోమునా మదిని బూనిభజింపనె వేడ్కమీఱఁగన్.

ఉ. తానొకనాఁటివేకునను దల్పమునన్ శయనించియుండఁగా నే
నటలేచి లేపఁగను నిద్రతమిన్ వెస నాకు లక్ష్యముం
బూనినరీతి నాదెసకుఁ బొల్పుగ మోముసి కౌఁగిలించున
మ్మానిని నాత్మనిప్పటికి మర్వక నే భజియింతు నెంతయున్. 130

మ. చనుదోయిన్ మొగనుంచు లేఁజెమటలన్ జాఱంగ గురుల్చె
క్కులం, దనరం దూలఁగ హారము ల్చెదరి హాసం బై రతు
ల్సేయుచోఁ, జనువొప్ప నన్నుఁ గాంచి లేనగవుతో శ్వాసో
క్తుల న్నాటికిన్, గొనబై పల్కునదూటి నామదినిఁ గోర్కుల్
ఆ భావించెదన్. 131

మ. అలరుం బానుపు డాసివచ్చుటకు నేనాలస్యముం జేయఁగా
వలపెచ్చం దలపోసి కామవికృతిన్ ద్వారంబున న్నిల్చి సం
చలనం బందుచు నెచ్చెలిం గదిసి కాంక్షల్మీఱ నెగ్గెత్తి కో
కిలవాగ్వైఖరి రోదనంబు గనునా కేళీసతిం గాంచెదన్. 132

ఉ. ద్వారమున న్వసించి కడుదైన్యమున న్ననుఁజూచిచూచి త
ద్ద్వారతలంబునం బడి శుగార్తిని డస్సియు నించుకంత ని
ద్రారతిఁ జెంది లేచి మది తల్లడిలంగ లసత్కపోల యై
యూరయుచున్న నెచ్చెలిని నాత్మ భజించెద మాటిమాటికిన్. 133

మ. బలుయూర్పుల్ నిగుడంగ నేత్రయుగళి న్బాష్పాంబువుల్రాలసం
చలతం జూచుచు నావిధం బడుగుచున్ స్వాంతంబు నానావిధం
బులఁ బోఁగా మదనుండు పైకొనఁగ మోహమ్మున్ వాంచి చింతించు న
బ్బలభిన్నీలశిలాకచన్ మదిని నేభావింతు నెల్లప్పుడున్. 134

ఉ. వేకువ నొక్కనాఁడు నిజవేశ్మమున న్నెఱిగొప్పు వీడఁగాఁ
గోకిలవాణి యున్మిషితఘూర్ణితదీర్ఘవిలోచనాబ్జ యై
తేఁకువ నిద్రలేచి రుచి దేఱఁగ నొక్కనమోవి కేలిచే
నాకరగప్పఁగా నది మదాత్మను నిప్పటికిం దలంచెదన్. 135

చ. మఱియొకనాఁటిప్రొద్దునను మానకఁబంచ టసుంగుపైని దా
నిరవుగ నెచ్చెలింగదిసి యెంతప్రియోక్తులు పల్కుచుండ నేఁ
బరువునవచ్చి వెన్కనిలువం బడినంతనె చూచి సిగ్గుతోఁ
జిఱునగవొప్పఁబోవుచెలిఁ జిత్తమునం దలపోసిచూచెదన్. 136

మ. అపరాధం బొనరించితీ వనుచు న న్నత్యంతకోపంబుతో
నుపలాలింపక నెమ్మొగంబియక యోహోహోచాలుఁజాలుం బుబో
నపుడున్నేను బ్రియోక్తి నాముకొన నత్యాసక్తి లేనట్టిమా
టపచారించిన నవ్వధూటిఁ గవుఁగింటం జేర్చిలాలించెదన్. 137

చ. పడుకొని యంతలోనఁ బరిభావితయై వడి లేచి నిద్రచేఁ
దొడిఁబడనావులించి మెయి దొట్రువిదిర్చివిజృంభణక్రియం

బొడమిన మోము వాసనకుఁ బూని భ్రమించుచు నున్న తేం
ట్లనఁ, దడికిఁ జలించునట్టి కనుఁదమ్ములుగల్గిన దానినెన్నెదన్.

చ. మనసిజపూజ సేయ నిజమానిను లందఱుఁ గూడి కేళికా
వనమున కేఁగుచోఁ దనను పార్శ్వమునన్ వసియించునన్నుఁ జూ
చెనసినశంకతోడ జను లేమనుకొందురొ యంచు భీత యై
క్షణ మటులుండుమంచుఁ గనుసన్నలు సేయువధూటి నెన్నెదన్.

చ. సరసిజనేత్ర దాఁ బ్రథమసంగమవేళను సిగ్గు దోఁప నే
నరయుచు ధైర్యవృత్తిఁ గదియంగఁ దలంచినఁ జూచి ప్రాణ్కులు
ల్నెఱపఁగ నందు దీపశిఖలీనఁ గంపము నొందు కర్ణభా
సురకుముదంబుఁ గప్పుసతిఁ జూచెద నిప్పటికిన్ ముదంబునన్.

చ. చెలి తమితోడ నెచ్చెలుల నీ యని కోపము సేసి శీఘ్రితం
దలతల మంచుఁ బోఁగదిమి తత్పరతం బులకల్ జనింపఁగా
నలరుచు సంస్మితాస్యయయి యంతట నా దెసవచ్చి కూటమిం
గలసినభామినీమణిని గాంచెదఁ గన్నులకర్వదీఱఁగన్. 141

మ. కలకంఠోపమకంఠి నాస్యజితరాకాచంద్రబింబ న్మయూ
రలసద్బర్హసమానవేణి సుగుణవ్రాతాత్మ నేత్రప్రభా
విలసన్మత్తచకోర యానవిజితశ్వేతచ్ఛదం గాంచనో
జ్జ్వలకుంభస్తనిఁ గామినీమణిని నే భావింతు నెల్లప్పుడున్.

మ. విరిశయ్యం బవళించి మన్మథమదావిర్భూతి కంగంబులన్
సరిఁగావింపుచుఁగౌఁగిలించిముద మెచ్చన్నాదు కెమ్మోవిసుం
దరవక్త్రంబున నిల్పి పై సురతసంధానంబు గల్పించుశం
బరవిద్వేడ్ధ్వజవైజయంతి మదిసంభావించి ప్రార్థించెదన్. 143

ఉ. సిబ్బెపుగబ్బిచన్నుఁగవచెన్నుగ నిక్కఁగ నక్కళించి యం
దబ్బురపాటు గన్పడఁగ నంగవిభంగమిషంబునన్ రుచుల్
గుబ్బతిలంగ బాహులతలుం బయికెత్తి గభీరనాభి పె
ల్లుబ్బినవేడ్కఁ జూపుచెలి నుల్లమునం దలపోసి చూచెదన్.

చ. వరుస నివద్రితంబు లయి వ్రాలు నవాంగవిలోకనంబులన్
మరుదళనోపమానమృదుగంధరమంజులభాషణంబులన్
దరమధురస్మితంబులను దాళిమియానములన్ విలాసతన్
సిరు లెసఁగంగ నొప్పుచెలిచేష్టలు నామది సంస్మరించెదన్.

చ. కనుఁగవ యుంచుకంత నెఱిగా నొనరించి సరత్నపాళికం
కణములరుణంకృతిధ్వనులగౌరవ మొప్పఁగఁ జన్నుదోయి ని
క్కనుగనుబొమ్మలెత్తినిజకైశ్యముచక్కఁగ మెచ్చునప్పుమా
నినిఁ బలుమాఱునిప్పటికి నేమదిలోభజియింతు నెంతయున్.

చ. అరయ సహింపరానివిరహాగ్ని జెందిన ధైర్యంబునన్
సురతవిశేషసంగతులఁ జొక్కపుతాండవసూత్రధారి యై
తరమిడి యంగమంగమును దాఁకఁగ గౌఁగిటఁబట్టికన్నుదో
యరయుచుచెక్కునొక్కుసతినాత్మ భజించెదఁగోర్కిమీఱఁగన్.

చ. విలసితమన్మథున్ విరహవిహ్వలలాసగాత్రి సుందరిన్
లలితకురంగనేత్ర సువిలాసరసాంచితచారుకాంచనో
జ్జ్వలమహనీయచేలయుతశ్యామ విరాజితహంసయాన నే
నలవడ సంస్మరించెద ననారతముక్ మదిలోన వేడుకన్.

చ. మలయగిరిప్రభూతపవమానములం గని తీవ లాడఁగా
సలలితరత్న వేదిపయిఁ జక్కఁగఁ దా వసియించి గీతముల్
దలకొని వీణ సుస్వరయుతంబుగఁ బాడుచు నాళిపాళికిన్
లలి శ్రవణోత్సవం బొసఁగులకుణగాత్రిని నే భజించెదన్.

### వీరసేనుండు కవిరచించుపద్యంబుల రాజునకుఁ బంపుట.

వ. అని యిట్లు కవివరుండు మదనోన్మాదంబున యామినీపూర్ణతిలకాయత్తచిత్తుండై తద్వర్ణనాతివిశేషంబులుగా రచించిన పద్యంబులు లిఖింపంజేసిన వీరసేనునియనుమతంబునఁ దద్భృత్యులు భూపాలుని కప్పటప్పటి కర్పించినం జూచిచూచి యంతకంతకుఁ గోపాటోపంబునఁ గసరివేయుచున్న వారును విసికివిసికి మరలివచ్చి తద్వృత్తాంతం బంతయుఁ గవివరుండు విన వీరసేనున కిట్లనిరి. 150

చ. హిమరుచిసత్కళావిభవుఁ డీకవిరాజు రచించు నట్టిప
ద్యములు గ్రహించి భూవిభున కర్పణసేసినఁ జూచి కోపభా
వమున దురుక్తులం బలికి వారక పొమ్మనుఁగాని మంచిమా
టమరఁగ బల్కఁ డాతఁడు తదాగ్రహవృత్తివచింపశక్యమే.

చ. అనవుడు వీరసేనుఁడు దగాననముం గని యోకవీంద్ర యో
యనఘుఁడ యింగితానవసుతాభుఁడ వౌనిను సత్కృపామతిన్
మనమున హింససేయు మది మానితిఁ బూనితి నే ధరింపఁగాఁ
బనివడి వ్రాయుపద్యములు పార్థివుఁ డొప్పఁడి దేమి సేయుమున్.

చ. అనవుడు భూసురుండు హృదయాబ్జమునం గడు నవ్వి యోరిని
న్ననయము మెచ్చితిన్ విను ధరాధిపుమానసముం గరంగు
నే, పనివడి యేల పంపితివి సాల్పడి నాకయి బ్రహ్మదేవుఁ డి
ట్లనులిఖియించియుండ వెతలంబడఁ గారణమేమి చూడఁగన్.

ఉ. ఓరి తలారి వీరి మఱి యూరక త్రిప్పకు మేమి త్రిప్పఁగా
సారముఖడ్గముం గొని విచారము సేయక త్రుంపుమన్నఁ ద
ద్ధీరత గాంచి వాఁడు క్షితిదేవకులోత్తమ యేతదర్థమై
యూరయఁ జాల నెంతపనికైన భరింపుదు నిన్ను లెస్సఁగన్.

క. ఏమేమి వ్రాసితివో యా
భూమీపతిమానసంబు పొరలక పోయె
సామీ యీమాటైనను
సామోదత మంచిపద్య మానతి యిమ్మా. 155

వ. అనిన విని సృష్టికర్త యైనస్రష్ట నుద్దేశించి. 156

సీ. తనపృథ్వి యాఘనాఘనవేణి చరియించు
క్షితిభాగమున నుండఁ జేయుమయ్య
తనరసం బాసుధాధర క్రీడ లాడెడు
శృంగారసరసిలోఁ జేర్పుమయ్య
తన తేజ మాత ప్రకసకాంగి దర్శించు
దర్పణాంతరమునఁ దార్చుమయ్య
తనవాయు వాసుగంధశ్వాస విసరించు
కొనువ్యజనంబునఁ గూర్పుమయ్య
తే. తననభం బారమణియింట నునుపుమయ్య
యీశరీరంబు పంచత్వ మెనసినపుడు
నాంశములఁ గోడ భూతంబు లైదునైదు
గూర్పుమయ్య విధాత నాకోర్కి దీఱ. 157

వ. అని యిట్లు కమలభవుని వేఁడి త్రికరణపూర్వకంబుగ నమ
స్కరించి నిలువంబడియున్న వీరసేనుఁడు తత్పద్యంబు గ్రహిం
చుకొని రాజసమీపంబునకు వచ్చి తత్పత్రిక సమర్పించిన.

క. ఇదియేమి మాటిమాటికి
హృదయంబున లేదె భీతి యొంతయు నన వాఁ
డదురక సామీ భూవర
యిది చూడుఁడు యొక్కవింత యేమో తలఁపన్. 159

వ. అనిన లిఖితంబు గైకొని పద్యంబుఁ జదువుకొని యయ్యర్థం
బనేకార్థంబులుగాఁ దోఁచినఁ గొంతతడ వాలోచించి యి
ట్లనియె. 160

క. ఓరి దురాత్మక విని పలు
మాఱిటు రావలదు హెచ్చి మఱి వచ్చితివా
నేరముగొందు గ్రహించుక
యూరక యాపని ఘటింపు మొప్పదు మాకున్. 161

ఆ. అన నిరాశుఁ డగుచు నావీరసేనుండు
వచ్చి పలికె విప్రవరునితోడ
నేమి వ్రాసినావొ యెఱుఁగ నే నింతైన
మనసు గరఁగదయ్యె మనుజపతికి. 162

మ. అనిపల్కం దలయూఁచియూఁచి మది నాహా యంచు వేసాహ
సంబునఁజాతుర్యమెలర్పఁగాఁ దనగతిన్ భూమీశునుచ్ఛ్రాయ
ముం, గని రెండొక్కటి యైన మంచిది యగుంగాకంచు నిశ్చింతుఁ
డై, చన నూహించె శరప్రయోగమయియేఁచం బద్యముద్య
ద్గతిన్. 163

## కవిరాజు కోపశాంతికరం బైనయొకపద్యము వ్రాసిపంపుట.

చ. రవిజుఁడు భా గుణింప విధురంబుగ భట్టి నశించె భారవి
ప్రవరుఁడడంగె దీర్ఘమునఁ బ్రాణముఁ బాసెగుడియ్యభిక్షుఁడీ
యవనికిఁ దప్పె భీముఁడు పదంతగతి న్మఱి కొమ్మువెట్ట ని
క్కువముగ నేభుకుండుఁడను గొమ్మునదీర్ఘము వెట్టకుండఁడీ
భువి నతఁ డెన్న నిర్దయుఁడు భూపతి నీవుఁ దలంప భూవరా.

వ. అని యీపద్యంబు లిఖియించి వీరసేనున కిట్లనియె. 165

క. ఓపుణ్యాత్మక వినుమా
యీపద్యముఁ జేగ్రహించి యెంతయుఁ జని నీ
వేపున నొసఁగిన వేయా
భూపతి ననుఁ బిల్వనంపుఁ బొమ్ము రయమునన్. 166

వ. అనిచెప్పిన నప్పద్యంబుగ్రహించుకొని పోయి రాజుముందఱం బెట్టిన నప్పత్త్రిక దండధరాసిపుత్త్రికవిధంబునమదికిం దోఁపం జూచి తదర్థంబుగ్రహించి మహీవల్లభుండు పవనోత్కంపితకదళికాముహీరుహంబుచందంబునఁ గంపితసర్వావయవుం డై యెంతయుం బ్రొద్దు చింతించి తదుభయదృఢతరస్నేహసారంబులును దత్కవితామహత్త్వంబును విచారించి వానితో ని ట్లనియె. 167

—— రాజు కవిరాజుం బిలువఁబంపి పుత్త్రి నూఱడించుట. ——

క. ఓవీరసేన యిచటికి
వేవేగమ దోడితెమ్ము బిల్హణు ననినఁ
భావము రంజిల వాఁడు ధ
రావిభునకు మ్రొక్కి వచ్చి రాసుత కనియెన్. 168

క. ఓతల్లి నీమనోహరు
నాతతసదయాంతరంగుఁ డై వసుధేశుం
డీతఱిఁ దోడుక రమ్మనె
నీతాపము మాను మింక నీరజనయనా. 169

వ. అనిన విని శ్రీఘ్నసముయోష్ణదందహ్యమానమానస యైనమయూరిక ఘనాఘన గర్జానినాదంబు వినినచందంబున సుందరీమణి తద్వచనంబు విని కుతూహలాయత్తచిత్త యై కంఠహారం బొసంగిన గ్రహించుకొని బిల్హణున కి ట్లనియె. 170

ఉ. ఓకవిరాజశేఖర మహోన్నతి నీవు రచించుపద్యముం
దేఁకువతోడ నానరపతిం గని యిచ్చినఁజూచి యెంతయుం
గైకొని దానియర్థమును గాంక్షదలిర్ప గ్రహించి యప్పుడ
స్తోకజవంబుమీఱ నినుఁ దోడ్కొనిరమ్మనెనయ్యలియ్యెడన్.

వ. అని యత్యాదరంబున శుభలక్షణప్రశస్తం బగునతనిహస్తం
బుఁ బట్టుకొని వచ్చునెడ. 172

తే. రాజగా జగుమదనాభిరామనృపతి
తనకుమారిని దలఁచి యాస్థాన మెడలి
వచ్చి తద్ద్వారమం దున్న వనజపత్ర
నేత్రిదగ్గఱఁ జేరి కన్నీరు దుడిచి. 173

తే. శిరము మూర్కొని చికురముల్ సిక్కు వాపి
చక్కఁగా నిడి గద్గదస్వరముతోడ
ననియె దయ మీఱ భూపాలుఁ డాత్మజాత
కష్ట సంతాపమును మాను మమ్మ యనుచు. 174

క. ఓకూర్మితనయ కవివరు
నీకోరిక మీఱఁ గూర్తు నిశ్చలమతి నై
నాకడకును రావమ్మా
యీకడ నాచేయుపని గ్రహింపుము మదిలోన్. 175

రాజు కవివరు నెదురుగాఁ జని తోడ్కొనివచ్చుట.

వ. అని యుపలాలించి యంతఃపురంబున నునిచి బిల్హణునకు
నెదురుగాఁ జని నమస్కరణపూర్వకంబుగఁ గౌఁగిలించి చతు
రంతయానంబు నధివసింపంజేసి సభామంటపంబునకుం
దోడ్కొనివచ్చి యుచితాసనంబునం గూర్చుండ నియమించి
సభాసదులు విన నృపవరుం డతని కిట్లనియె. 176

ఉ. ఓచతురాననాన్వయమహోదధిపూర్ణశశాంక బిల్హణా
ఖ్యా చతురాస్య నీమహిమఁ గన్గొన నేరికి శక్యమౌ ధరన్
నీచతురోక్తివైఖరికి నీదృఢవృత్తికి నీకవిత్వధా
రాచలితైకనిష్ఠకు నహర్నిశమున్ మది నేను మెచ్చితిన్. 177

రాజు కవివరు నాదరించి తనకూఁతుఁ బెండ్లిగొమ్మనుట.

చ. తడఁబడి యెవ్వఁడేనియుఁ గృతఘ్నునియందొనరించు మేలు
క్రైవడిని మదీయమైత్రిసుము భవ్యగుణాకర నీమనంబునం
దడవక సుందరీమణివతంసము నాతనయన్ వరించి యే
ర్పడ నయమొప్ప నుత్సురికి భర్తవుగమ్మని పల్కె వెండియున్.

క. రేపు సమస్తం బగుఁ గా
కీప్రొద్దున్ బడలినావు హితమతితో నీ
వీపట్ల నేఁడు దేఱుము
భూపాలనుతైకచర్య భూసురవర్యా. 179

వ. అని యొడంబఱిచి కవివరుని యథాస్థానంబున కనిచి వసం
తాఖ్యున కిట్లనియె. 180

క. ఓమంత్రివర్య చూచితె
భూమీసురుచిత్తవృత్తిఁ బోలింపంగా
నేమందు నెంతదృఢ మా
భామామణిహృదయ మట్ల పరిశీలింపన్. 181

క. ఈవిధమున నిర్వురకున్
దైవాజ్ఞన్ ఘటన మయ్యెఁ దప్పింపంగా
నావశమె యగ్రజన్ముఁడు
భావింపఁగఁ గూఁతు నిత్తు భవ్యవిచారా. 182

వ. అనిన విని మంత్రివరుండును సభాసదులును నేతత్కార్యంబు విశేషకార్యంబనిన విని వారలం బనిచి యంతఃపురంబుఁ బ్రవేశించి పరిచారికాజనంబులం బిలిపించి యిట్లనియె. 183

క. ఓకాంతలార మత్సుత
కాకవివర్యునకు భోజనాదులు పూర్వం
బేకోలఁది విచారించితి
రాకోలఁదిం జేయుఁ డనుచు ననిచి రయమునన్. 184

వ. తనవార యగుమందారమాలిక కాచందం బంతయుం జెప్పి యాయమ కానందం బాపాదించి భోజనాదికృత్యంబులు దీర్చి సుఖం బుండు నంత. 185

## ప్రాతఃకాలాభివర్ణనము.

చ. తెలతెలవాఱెఁ దూర్పు నలుదిక్కులవిచ్చెఁ దమంబు పక్షులుం
గలకలఁబల్కెఁ గోకములు గాంచె ముదంబు లుడువ్రజంబుఖ
స్థలమున నాఁకాడకును జాఱెఁ జెలంగి పదాయుధంబు లు
గ్గళగతి మ్రోసె వీచె వలిగాడ్పులు భూజను లుల్లసిల్లఁగన్.

సీ. కోకాంగనాగణశోకమారుతమిత్త్రి
ఘనతరజ్వాలలఁ గందినాఁడొ?
విరహాదుస్సహావధూవిపులనిశ్వసనోష్ణ
గంధవాహములచేఁ గమలినాఁడొ?
బాధితపద్మినీపటలశుక్సంప్రాప్త
ఘోరపాపంబునఁ గుందినాఁడొ?
జనదూరితాప్రాప్తజారచోరవ్రాత
శాపంబులను గొంత సమసినాఁడొ?

తే. యనఁగ దోషాకరుండు కళానుభూతి
దొరయ వెన్నెలఫులుగులఁ దొడరి యితఁడు
రేపు నేవేళ కొదవునో మాప నేమి
యనుచు వడి సారసుంత కొల్లాడ నరిగె. 187

ఉ. వెన్నెలతీవలం దడఁగి వెల్వడి విస్ఫురసారసావళిం, గ్రన్నన
సౌరభంబు గొని రాజిలుగంధసమీరణంబు ల, భ్యున్నత
సౌధరాజములఁ బుష్పశరాసనకేళిఁ దేలియుం, దున్న
వధూశ్రమాంబుశీతుఁ గొప్పలుమీఱి హరించునెంతయున్.

మ. ముదమొప్పారఁగఁ బద్మినీమణులు మోముల్విప్పఁ జక్రంబుల
భ్యుదయంబొంద సదాళులున్ సరసవిస్ఫూర్తిం బ్రవర్తిల్లనా
స్పదమై భాసిలుపుష్పదంతగజరాజం బెక్కి యుద్యద్ద్విజుల్
మదిరంజిల్లఁగ సన్నుతింపఁ బొలసెన్ మందానిలుం డత్తఱిన్.

మ. మలయాహార్యతటంబు డిగ్గి విలసన్మల్లీమతల్లీలతా
వళులం జిక్కి పయూసత న్వెడలి దీవ్యచ్చాగుకాసారని
ర్మలతోయంబుల నీఁది పంకరుహసౌరభ్యంబుఁ గొల్లాడి ప
క్షులనాదంబులతోఁ జరించు మరుదంకూరంబు లవ్వేళలన్.

క. తనతమ్ముల వైభవమును
గొనె నంట యొకరాజు వానిఁ గొట్టెద ననుచున్
ఘనకోపుఁ డయ్యె ననఁగా
నినుఁ డతితేజం బెసంగ నేతెంచె నొగిన్. 191

మ. హరివక్రంబుభరించి యుద్భటనిశాటాటోపముల్ మాన్చియు
ద్ధురలీలాస్థితి బుధాంకవర్తియయి యెంతోపూర్వదేశంబు భా
సురమై యొప్పఁగ నిందునందు నిలిపెన్ స్తోత్రార్హుఁడేయంచు శం
కరపద్మోద్భవులున్ భజింపఁ జెలఁగెం గల్యాదితా చారుఁడై.

ఉ. అంగుగఁ గాలమన్కరికి నావల నీవల వ్రేలుబంధురా
భంగురపాశము ల్వేలయు బంగరుపోఁతలఘంటలో యనన్
సంగతి మీఱఁ బ్యాక్స్వరమ్మశైలములం గనుపట్టి రక్కసా
రంగధరుల్ నిజోర్ధ్వరుచు లందము నొందఁగ నట్టివేగువన్.

క. హితవిబుధస్తితి గోత్రా
హితకరుఁ డుదయించె గురుబుధేశహితుం డై
ధృతిఁ బూర్వదేశముం గొని
క్రతువులు గోతలమునందుఁ గడు నొప్పారన్. 194

సీ. అతులద్విజాలోకనావహుం డై త్రయీ
సుముఖుఁ డై నట్టి తేజోమయుండు
కమలామనోహరాకారుఁ డై శర్వగీ
చరుల నొంచినచక్రభరణశాలి
యఖిలలోకతమోపహారణనై పుణ్యవృత్తి
రాజిల్లు నట్టిసర్వజ్ఞవిభుఁడు
మిత్త్రుఁ డై భువనపవిత్రకుం డై దగ
ధర వెలింగించుసన్మార్గన ర్తి
తే. యాదిమూర్తి యనంగఁ బద్మాప్తుఁ డనఁగ
నార్జితార్యుఁ డనంగ దివ్వైకవాక్ స్త
వముల ద్విజరాజసంగతి వసుమతీంద్ర
శేఖరారూఢతను రవి చెలఁగె నెదుట. 195

తే. అలరుతమ్ముల నొకటి గా నాత్మఁ దలఁచి
దిశలు చెలువొందఁ దమము భేదించి తనదు
లోకబాంధవవిఖ్యాతి లోకు లెన్నఁ
గరము వెలుఁగంగఁ బద్మినీకాంతుఁ డలరె. 196

క. ఉరుకువలయంబు బెగడఁగ
ఖరకరుఁడు జనించి రాఁగఁ గలుగుసదాళిన్
వరుసఁ గవి రూపు మాపఁగ
నరిగెను ద్విజరాజు పశ్చిమాంబునిధికడకున్. 197

చ. సమయకిరాటకుం డుదధిజాడల వచ్చుచుఁ జేరె పూర్వది
గ్రమణికి విక్రయించుదయరాగపువన్నెపటంబు విచ్చిచూ
పె ముదికి వార్ధ మైన నది బేరములాడికి బల్ఫమైననని, పక్కము
నొక టిచ్చెనో యనఁగఁ జాయలుదోఁపఁ గనుంగొనఁ జెల్వగున్.

తే. ఒక్కయినుఁ డంతకంతకు నుక్కు మిగుల
నొక్కరా జది సూడంగ నోర్వలేక
డింది వెల్వెల నై యొక్కదిక్కు సేరె
ననఁగ సూర్యుండు హెచ్చె హిమాంశుఁ డడఁగె. 199

చ. సమయవినోదిమిన్ననెడి చక్కనిరంగమునందు సర్వది, గ్రమ
ణులుచూడ గారడముర క్తినిఁ జూపవిధుం డనెండునద్దమునో
కకర్ణమం దునిచి దాపలికర్ణమునందు హేమచక్రము వెడ
లంగఁ దీసె ననఁగా రవి దోఁచెఁ బ్రభాప్రభావుఁడై. 200

రాజు దనకూఁతును గవి కిచ్చి పెండ్లిసేయ సమకట్టుట.

వ. ఆసమయంబున నంతకుమున్న మంగళతూర్యనాదంబులు
వినుచు మేల్కని మదనాభిరామభూమీధవుండు స్నాన
సంధ్యాద్యనుష్ఠానంబులు నిర్వర్తించి సముచితాలంకారుం
డై సభాస్థలంబునకు వచ్చి మంత్రిపురోహితామాత్యబంధు
విద్వజ్జనంబుల రావించి వారల నుచితాసనంబులం గూర్చుండ
నియమించి సుప్రసన్నుండై యిట్లనియె. 201

క. ఘనులార బిల్హణాఖ్యున
కెనయఁగ మానుకకుమారి నిచ్చెద నని నే
మనమునఁ దలఁచితి నిప్పుడు
ననుకూలము బ్రహ్మ పూర్వమందె ఘటించెన్. 202

వ. అని యిట్లు పలికి వారలయనుమతంబున ముహూర్తనిర్ణయం
బు సేయం దలంచి జ్యోతిశ్శాస్త్రకోవిదులఁ బిలిపించి యడిగిన
వార లిట్లనిరి. 203

క. గురుకవియుక్తి నినుందుర
వరుస సమందాత్ముఁ డగుచు వసుధఁ బరఁగినం
బరికింపఁగ ద్విజరాజుకుఁ
జిరతరముగ మంగళాప్తి చెన్నగు వేడ్కన్. 204

తే. నీకుమారిక యుళి యయ్యె నాకవీంద్రుఁ
డలర ధను వయ్యె నిర్వుర కనుగుణంబు
గ్రహావిరోధంబు నెంచుఁ గానఁబడదు
రాజబల మొప్పు నొప్పుఁ దారాబలంబు. 205

క. ఈకన్య కిపుడు ద్విజరా
జాకట నాజింటఁ జెల్వ మలరినవాఁడై
చేకొని పదిటను మిత్రగత
శ్రీకరముగ నొప్పు నతనుసిద్ధి నృపాలా. 206

వ. అని యిట్లు పలికిన సంతుష్టాంతరంగుండై నృపపుంగవుండు ని
జనగరం బలంకరింపం జేయుం డని పరిచారకులం బంచిన.207

సీ. పచ్చలతోరణపంక్తులు ఘటియించి
కస్తూరిపూఁతలుగా నొనర్చి
మలయజపంకంబుఁ జిలికి జవ్వాది చే
కలు దీర్చి రత్న వేదులు నమర్చి
ముత్యాలనవరంగముల రంగు గావించి
నవవజ్రమయవితానములు నెఱపి
వాసితాగరుధూపవాసనల్ నిగిడించి
పగడాలమెఱయుచప్పరము లునిచి
తే. ప్రతిగృహంబుల భద్రకుంభములు నిలిపి
దర్పణంబుల ద్వారబంధములఁ గూర్చి
ధవళసౌధాళిఁ జిత్ర కేతనము లెత్తి
పురము శోభిల్లఁ జేసి రబ్బురము గాఁగ. 208

సీ. ఏవీథిఁ జూచిన నింపుమై మంగళ
తూర్యనాదములు సంతోష మొసఁగ
నేచాయఁ గాంచిన హితముగాఁ జెవులకు
వీణారవంబులు వేడ్క సేయ
నేపట్టుఁ గనిన భేరీపటహాదికా
హాళమృదంగైకవాద్యములు వెలయ
నేచోటు వీక్షింప వాచాచమత్కృతిఁ
బాటలు మాటలుఁ బరిఢవిల్ల
తే. నొప్పెనక్షత్రవల్లభాభ్యుదయమునకుఁ
జెలఁగి మిన్నంది యుబ్బినజలధికరణిఁ

దనరఁ గవిరాజశుభమహోత్సవమునకును
నగరరాజంబు సంతతానంద మొందె. 209

క. ఆ త్తఱి నయిదువ లారతు
లెత్తుచు ధవళములు వాడ నింపు దలిర్పం
గ్రొత్త గనిపింపఁ బెండిలి
చి త్తరుచవిక కరుదెంచె క్షితిసురుఁ డెలమిన్. 210

సీ. ఈధానునిధికరం బెనయంగ నలుఁ గిడ
నేర్తువు పద్మిని నీవు రావె
యింకళానిధిఁ జేరి యెలమి సేవలు సేయ
నేర్తువు మృదుహస్త నీవు రావె
యీచతురాస్యుతో నింపుమైఁ బలుకంగ
నేర్తువు శుభవాణి నీవు రావె
యీమహాసర్వజ్ఞుఁ కర వొంద శిర సంట
నేర్తువు శశిరేఖ నీవు రావె
తే. యనుచుఁ దమలోన భూమిపాలానుమతిని
సరససల్లాపవచనరచనలు చెలువు
నంగనారత్నములు గొంద ఱానువర్ణ
గాత్రుఁ గదియుచు మంగళారాత్రిక లిడి. 211

క. మంగళము రాజనుతునకు
మంగళ మంబుజముఖీరమాతనయునకున్
మంగళము శాస్త్రవేదికి
మంగళము కవీంద్రమౌళిమణికి సుగుణికిన్. 212

వ. అనుచు నారతిపాటలు పాడి శిరంబున వక్షత లునిచి. 213

చ. నడుమసియాడఁ జన్నుఁగవ నాట్యముసల్పఁగ రత్నహారముల్
దడఁబడి డోలికాకలనఁ దార్కొన వేణి చలింప నెమ్మొగం

బోడలును జెక్కుటద్దములు నొయ్యఁ జెమర్పఁగఁ గంకణంబు లే
ర్పడి రవ ముప్పతిల్ల నొకభామ తలంటెఁ గవీంద్రమౌళికిన్.

తే. గందపటకలిఁ దలఁ బుల్సి మంద మైన
బంగరుకటాహములలోనఁ బొంగుజలముఁ
బోట్లు గావించి బిందియ ల్పట్టి యొక్క
యతివ సుకవికి మజ్జనం బార్చె నపుడు. 215

సీ. తడి యార్చి వలువ లేర్పడ నిచ్చె నొకలేమ
యుదుటుపావా లుంచె నొక్కభామ
పువ్వులు సిగఁ జుట్టెఁ బూలు పొంద నొకకొమ్మ
ముడుపులు నిడె నొక్క ముద్దుగుమ్మ
కస్తూరితిలకంబు ఘటియించె నొకజాణ
యొడల గంధ మలందె నొక్కచాన
చొకట్లపోగులు సవరించె నొకబాల
యురుహారములఁ బూన్చె నొక్కగోల

తే. పడఁతి రత్నపుటుంగరాల్ దొడిగె నొకతె
వెలఁది కపురంపుసురఁటిచే విసరె నొకతె
నిలువుటద్దంబు ముందర నిలిపె నొక్క
మగువ బిల్హణకవిశిఖామణికి నపుడు. 216

క. ఈరీతిఁ గవిని చెలు లిం
పారఁగఁ గయిసేసి నృపవరాత్మజ కెంతో
నీరాట మొనర్చియు శృం
గారించిరి వేడ్కఁ బోడను గ్రక్కున సంతన్. 217

క. సరిగంచుచీర కట్టెపై
నెఱియంగాఁ గట్టి రైక నీలై మెఱయన్

సరిగుబ్బలు గుబ్బశీలం
గరముగ సవరించి పైఁట గావించి కొఁగిన్. 215

క. ఇఁకఁ జిక్కువాసెనే ముని
చికురంబులు చిక్కుదీర్చి చెలువుగఁ గీల్గం
టొకయింతి వెట్టి నవ్వుచు
సకి ముడి బాగుపడె ననుచు నన్నుతి సేసెన్. 216

తే. సూర్యచంద్రులు మైత్రిచే సుదతివదన
వనజ మంతియు సంతతవైభవంబు
నందఁజేయ వసించికో యనఁగ నపుడు
సూర్యచంద్రుల నిడె నొక్కశోభనాంగి. 217

ఉ. కోరిక నాఁకలిం గొని చకోరికలుల్ జవ ముప్పతిల్లఁగా
సారసవైరియం దమృతసారము నూటుచుఁ దోనె తద్గతం
బైరహిమించు నల్పుగొన నత్తఱిఁ జాఱె ననంగ నొక్కసిం
గారపుబొమ్మ వాలుఁదెలిగన్నులఁ గాటుక దీర్చె బోటికిన్.

తే. తారకావళి సేవ్యమై తనరునట్టి
చంద్రబింబంబుకోసుత పాటి సేయఁ
జెలువమోమునఁ గస్తూరితిలక మునిచి
ముత్తెములచేరు లమరించె ముదిత యొకతె. 219

క. అద్దములవంటి చెక్కుల
నిద్దపురుచు లుప్పతిల్ల నీటుగ శ్రుతులన్
ముద్దులగుమ్మకు నొక్కతె
ముద్దియ కుండలము లునిచె ముద్దులు గాఱన్. 220

క. సంగతిగ మోవిచవిఁ జూ
డం గవి యరుదెంచె ననఁగ దార్కొనునాసన్

రం గలర నాణిముత్తెపు
ముంగఱఁ గీలించె నొకతె ముదితామణికిన్. 221

క. దరము వివరం బెఱింగియు
వరుసం దనజన్మసీమవారిని వేడ్కన్
భరియించె ననఁగ నొక్కతె
యురుకుచ మెడ మ్మైసరుల నునిచెం బ్రేమన్. 222

క. స్ఫుటముగ నీయుత్సవమునఁ
గటకంబులు మ్రోసె ననుచు ఘనమణిభాస్వ
త్కటకమ్ము లునిచె నొక్కతె
కుటిలాలకకిఁ ముందుఁ గొమరు సెలంగన్. 223

క. పిఱుఁదులు ధరగొని దీవులు
నిర వొందఁగ నాక్రమించి యేర్పడె ననుచున్
బిరు దుంచినగతి నొక్కతె
మొరయఁగ రత్నముల కాంచి నునిచెం జెలికిన్. 224

క. కరిగమననడలు మదనుని
కరిగతులఁ ధిక్కరింపఁ గల వని యందెల్
సరి మ్రోయఁగఁ జరణంబుల
నరు దారఁగ నిలిపె నొక్క యతివ ముదమునన్. 225

క. ఈవిధమున రమణీమణు
లావసుధారునిపుత్త్రి కంచితలీలన్
వేవేగ నలంకారము
గావించి వివాహవేదికడ నిల్పుటయున్. 226

సీ. సణివీకుణములు రసప్రవర్తకము లై
నెమ్మోముఁ దమ్మిపైఁ గ్రమ్మికొనఁగ

బిసరుహేక్షణాదృష్టులు సుమనోహరములై
గళితసుగంధవిశేషకలనఁ బొదలఁ
దరుణాంగిచూపు లస్త్రతతి శిలీముఖములై
హృదయపంకజ మావహించి నాట
భామినీలోచనప్రభలు వరాళులై
తనరారుపాదపద్మములఁ బ్రాలఁ

తే. బరఁగి కవిరాజు పూర్వసైఖరి మోహా
కలితవిభ్రమవిస్మయాక్రాంతుఁ డగుచు
వనితరాయత్తచిత్తుఁ డై యారాత్రిలోనఁ
జెలువభావంబు గాంచి పేక్షింపు చుండె. 227

సీ. ఈసర్వమంగళ యీక్షణాకాంతులు
భరితసుధాకరప్రభలు గాఁగ
నీశ్యామకన్తోయి నింపారుదీప్తులు
ప్రాసిసగళికాంతుభూతి గాఁగ
నీసతికన్నుల భాసిలుదీధితుల్
పోలు పొందఁ దమ్ములపూజ గాఁగ
నీయార్యాలోచనచ్ఛాయలు మాళిపైఁ
బ్రవహించుగంగాఝరంబుఁ గాఁగఁ

తే. బరఁగు కవిరాజమౌళి సర్వజ్ఞమూర్తి
విలసదసమాంబకస్ఫూర్తి విశదకీర్తి
యంచితాచలభోగభాగ్యైకవర్తి
యనుచు నచ్చటివిబుధాళి యభినుతింప. 228

సీ. భావిఫలోదయప్రాప్తభాసురములై
పరఁగుమౌక్తికముల బాగు లనఁగ

రతిపంచశరులు సంగతశ్రేణిఁ దేలుచుఁ
బనివడి సూసపూబంతు లనఁగఁ
దియ్యవిల్తుఁడు రెండు తెఱఁగు లై యిరువుర
కడ లంది వేయుమార్గణము లనఁగఁ
దనవలనను వీగు దనరారి రసాచుఁ జం
ద్రుఁడు సల్లు నమృతబిందువు లనంగ

తే. జెలఁగున స్వామినీపూర్ణతిలక బిల్హ
ణాఖ్యకవివర్యచూపు లన్యోన్యమైత్రి
నొలయుచు గతాగతంబు లై కలయ నడరి
వెలయఁ జూచిన జనులకు వేడు కయ్యె. 229

తే. లలితముగ విప్రులు 'తదేవలగ్న' మనుచు
మంత్రములు వాడ శుభసీత మహితలీల
వరుస నుంచిరి యవ్వధూవరుల నృపతి
యనుమతంబున నైదువు లపుడు వేడ్క. 230

తే. పుడమివేల్పులు పుణ్యాహపూర్వకముగ
దేవతాహ్వాన మొనరించి తిపిరి వారి
కరములను గంకణములు వేడ్కను ఘటించి
చదివి రెంతయు మంగళాష్టకము లపుడు. 231

మ. పొలుపొందన్ ద్విజరాజశేఖరునకున్ భూభృద్వతంసంబు ని
శ్చలభావోన్నతిఁ గన్యనిచ్చు పగిదిన్ క్ష్మానాథముఖ్యుంబుగాఁ
బొలుపొందన్ ద్విజరాజశేఖరునకున్ భూభృద్వతంసంబు ని
శ్చలభావోన్నతిఁ గన్యనిచ్చె సుమనస్సంతానముల్ మెచ్చఁ
[గన్. 232

క. దలఁబ్రాలప్రకరంబులు
వెలఁదులు పార్శ్వములఁ బూన విభునిశిరమునన్
జలజాక్షి ముంచి దోయిటఁ
దలఁబ్రాలను బోసె విభుఁడుఁ దనపై నుంచెన్. 233

వ. ఇట్లనన్యాతిశయంబునఁ దదుత్సవంబు గావించి విధ్యుక్త ప్రకారంబుగఁ బ్రధానహోమంబు లాదిగాఁ గలవి యాచరించి బంధుసహితంబుగా రాజనాభ్యర్చనంబుల నొంది తదనంతరంబున శేషహోమాదికృత్యంబులను నిర్వర్తించి భూసురులకు మ్రొక్కి తదాశీర్వచనంబులు గైకొని బిల్హణుండును యామినీపూర్ణతిలకయును యథేష్టభోగంబు లనుభవించుచునెడ. 234

సీ. నీలమేఘంబులు శైలాగ్రములఁ బ్రాఁకెఁ
బరికింప వెల్వెలఁ బాఱె విధుఁడు
సన్నగించెను బికస్వరము లంతంతకుఁ
గలహంసగతులు సంగతులు దప్పె
గగనమార్గము సావకాశమై బలుపొందె
నహిరాజుహాస్య మందంద నిలిచెఁ
గేతకిదళములు గెలఁకుల భాసిల్లె
మెఱుపుఁదీఁగెలు మింటఁ దఱుచు మెఱసె
తే. నంద మొప్పఁగఁ గొలఁకుల నలరు వాడె
నాడకాడకుఁ గోరిక లతిశయిల్లె
ననుచు జను లెల్లఁ బొగడ ఘనాగమమున
గర్భగౌరవ మాకాంత గాంచె నంత. 235

వ. ఇట్లు నవమాసంబులు నిండి దశమం బగు మాసంబునం దో
క్క సుముహూర్తంబున. 236

మ. మగుదంకూరము సంచరింప గ్రహముల్ మార్తాండసంయు
క్తిచే, నెఱియర్ దిక్కులు దెల్విఁ జెంద గరిమ స్త్రీవ్యక్తస్వప్రదం
గాఁడివా, దృక్షదనంబుల్ సెలఁగర్ సురప్రసతి యుద్యత్పుష్పవ
ర్షంబు ల, శ్రీశక్తి వర్షింప వధూటి గాంచెను సుతుఁ గృత్తైక
భాగ్యోన్నతున్. 237

క. ఘనతం బ్రభాకరోదయ
మున జనియించుటయు విప్రముఖ్యులు వేడ్కం
గని లగ్నగతిఁ బ్రభాకరుఁ
డను నామం బిడిరి బిల్హణాఖ్యుఁడు మెచ్చన్. 238

వ. అప్పుడు మదనాభిరామభూమీధవుఁడు విద్వజ్జన బంధు
మిత్ర పురోహితామాత్యసమూహంబున నాసీనుం డనవంశకర్త
గాఁ బరిగ్రహించి జాతకర్మాదులు సలిపి గోభూతిలహిరణ్యా
దిషోడశదానంబులు సేసి భూసురాశీర్వచనంబులంది.

క. ఘనుఁడు ప్రభాకరుఁ డంతట
దినదినమును వృద్ధిఁ బొంది దీవ్యద్బలుఁ డై
కనుపట్టు వానిఁ బట్టము
చన నొప్పఁగ గట్టి సుఖము జయముం గాంచెన్. 240

మాలిని. ప్రథితగుణకలాపా భంజితేశానచాపా
ప్రథనవిజయకోపా భానుకోటిప్రతాపా

మథితదనుజదీపా మన్మథాచ్ఛస్వరూపా.
మధురతరకలాపా మాన్యరామావనీపా. 241

గద్యము. ఇది శ్రీసీతారామచరణసేవాప్రభావసంపాదితకవితావిచిత్ర కాశ్యపసగోత్ర పవిత్ర శ్రీమున్పుండి పెద్దికృష్ణస్వామి ప్రణీతం బయినబిల్హణోపాఖ్యానం బనుమహాప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

బిల్హణీయము సంపూర్ణము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1920.

# ఆంధ్రగ్రంథములు.

---

ప్రతి 1-కి రూ. అ.

శ్రీమదాంధ్రభారతము—పద్యకావ్యము:—

అనేక వ్రాతప్రతుల సహాయమున చిరకాలమునుండి సంపూర్ణ పరిశ్రమముతో బరిష్కరింపబడినది మేలుకాగితములపై స్ఫుటముగ అచ్చొత్తించి మంచికాలికోబైండు చేయబడి యున్నది.

| | | రూ. | అ. |
|---|---|---|---|
| 7 సంపుటముల ప్రతి | ... | 14 | 0 |
| 8 సంపుటముల ప్రతి | ... | 12 | 8 |

ఆంధ్రభారతము, పద్యకావ్యములు.—

| | | రూ. | అ. |
|---|---|---|---|
| ఆది, సభాపర్వములుగల సంపుటము | ... | 2 | 4 |
| ఆరణ్యపర్వము ,, | ... | 2 | 0 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 2 | 0 |
| భీష్మద్రోణపర్వములు ,, | ... | 2 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు,, | ... | 2 | 0 |
| శాంతిపర్వము ,, | ... | 2 | 0 |
| అనుశాసనిక అశ్వమేధ ఆశ్రమవాస మౌసల మహాప్రస్థానికస్వర్గారోహణపర్వములుగల సంపుటము | ... | 2 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 5 | 8 |
| యుద్ధపంచకము ,, | ... | 8 | 8 |
| శాంతిసప్తకము ,, | ... | 8 | 8 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారిది | | 0 | 8 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | ... | 0 | 12 |

| | | | |
|---|---|---|---|
| తెనుఁగుసమస్యలు, చక్కనికూర్పు | ... | 0 | 2 |
| భాస్కర రామాయణము, చక్కనికూర్పు | ... | 3 | 8 |
| కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము | .. | [illegible] | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు. లక్ష్మణకవికృతము | ... | 1 | 4 |
| నిర్వచనోత్తరరామాయణము, సాధారణప్రతి | ... | 0 | 12 |
| ఉత్తరరామాయణము, కంకంటి. పాపరాజప్రణీతము | ... | 2 | 4 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కని క్రొత్తకూర్పు | ... | 4 | 0 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు. శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనమమిక్కిలిసొంపు, పీఠిక అతివిపులము | | 5 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో చక్కగ ముద్రితము | ... | 0 | 12 |
| మార్కండేయపురాణము, మారనకృతము | ... | 1 | 12 |
| అచ్చతెనుగురామాయణము, శుద్ధప్రతి | . | 1 | 4 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్య ప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది (అచ్చగుచున్నది.) | | | |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానములో చిన్న సైజున మేలుకాకితముల మీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కగ ముద్రించియున్నాము | ... | 2 | 0 |
| వసుచరిత్రవిమర్శనము, శ్రీ చినసీతారామస్వామిశాస్త్రికృతము. అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందుఁగలవు | | 1 | 0 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు | ... | 3 | 8 |
| ఆముక్తమాల్యద, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో మేలుకాకితములమీఁద చక్కఁగ మరల ముద్రించియున్నారము. | | 3 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 12 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, పీఠిక విపులము | ... | 2 | 8 |

| | ప్రతి 1.కి రు. | అ. |
|---|---|---|
| కళాపూర్ణోదయము, దళసరికాకితములు ... | 2 | 4 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు ... | 2 | 4 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది, క్రొత్తకూర్పు ... | 0 | 14 |
| హరవిలాసము ... | 0 | 12 |
| కాశీఖండము, చక్కనిక్రొత్తకూర్పు ... | 1 | 8 |
| సారంగధరచరిత్రము, చేమకూర. వేంకటకవికృతము ... | 0 | 12 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర ... | 1 | 8 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 12 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవిది ... | 0 | 8 |
| రంగారాయచరిత్ర, దిట్టకవి, నారాయణకవి ప్రణీతము ... | 0 | 12 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు. రామభద్ర కవికృతము. | 1 | 4 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి. తిమ్మకవికృతము ... | 0 | 4 |
| శివలీలావిలాసము ,, | 0 | 8 |
| పారిజాతాపహరణము, చక్కనికూర్పు ... | 0 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవి ప్రణీతము ... | 0 | 12 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి. అబ్బయామాత్య ప్రణీతము ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవి ప్రణీతము ... | 1 | 4 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు ... | 0 | 12 |
| బసవపురాణము, పిడుపర్తి. సోమనాథ ప్రణీతము .. | 2 | 4 |
| హంసవింశతి, నారాయణామాత్య ప్రణీతము ... | 0 | 14 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మది, చక్కనికూర్పు. | 1 | 0 |
| రాజయోగసారము, ద్విపద ... | 0 | 4 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము ... | 1 | 2 |
| పంచతంత్రము, నారాయణకవికృతము ... | 0 | 12 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు ... | 1 | 0 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము ... | 1 | 8 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, అనేక నూతనాంశములు చేర్చి చిన్నసైజున ముద్రించినారము, టీక, వివరణము మిక్కిలి విపులము. ఈవఱకు ప్రకటితమైన ప్రతులకన్న బాగుగనున్నది. | 3 | 12 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రెగ్గడ, క్రొత్తకూర్పు ... | 0 | 12 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమహాత్మ్యము ... | 0 | 12 |
| విష్ణుపురాణము, ప్రాచీనప్రతి ... | 1 | 8 |
| అనుశాసనికపర్వము, సటీక ... | 5 | 0 |
| బిల్హణీయము, చక్కనికూర్పు ... | 0 | 10 |
| వైజయంతీవిలాసము ... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి ... | 0 | 6 |
| రసికజనమనోభిరామము ... | 0 | 12 |
| రాజశేఖరవిలాసము ... | 0 | 8 |
| సహస్రకంఠరామాయణము ... | 0 | 14 |
| శ్రీవాఘనివిధినాటకము ... | 0 | 2 |
| సులక్షణసారము, సటీక ... | 0 | 10 |
| ఆంధ్రభాషాభూషణము ... | 0 | 2 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక ... | 0 | 12 |
| ఆంధ్రభాషార్ణవము ... | 0 | 12 |
| దసరాపద్యములు ... | 0 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము ... | 0 | 12 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు ... | 0 | 6 |
| భాగవతసప్తమస్కంధము ... | 0 | 4 |
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు ... | 1 | 4 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|

## శతకములు.

| | | | |
|---|---|---|---|
| మాతృశతకము | ... | 0 | 2 |
| సుమతిశతకము, సటీక | ... | 0 | 3 |
| కుమారీశతకము ,, | ... | 0 | 3 |
| దాశరథీశతకము ,, | ... | 0 | 4 |
| మానసబోధశతకము,, | ... | 0 | 3 |
| భాస్కరశతకము ,, | ... | 0 | 4 |
| కలువాయిశతకము ,, | ... | 0 | 4 |
| కాంతాలలామశతకము | ... | 0 | 4 |
| కవిచౌడప్పశతకము | ... | 0 | 2 |
| నృసింహశతకము | ... | 0 | 2 |
| చంద్రశేఖరశతకము | ... | 0 | 2 |
| దేవకీనందనశతకము | ... | 0 | 2 |
| కృష్ణశతకము | ... | 0 | 2 |
| నారాయణశతకము | ... | 0 | 2 |
| సింహాద్రినారసింహశతకము | ... | 0 | 3 |
| జగన్నాయకశతకము | ... | 0 | 2 |
| ప్రసన్నరాఘవశతకము | ... | 0 | 3 |
| రామరాఘవశతకము | ... | 0 | 2 |
| సంపగిమన్నశతకము | .. | 0 | 2 |
| భద్రాద్రిరామశతకము, పావులూరి మల్లనకృతము | ... | 0 | 2 |
| రామలింగేశశతకము, అడిదము సూరకవిది | ... | 0 | 3 |
| కాళహస్తీశ్వరశతకము, ధూర్జటికవిది | ... | 0 | 2 |
| కుక్కుటేశ్వరశతకము, కూచిమంచి తిమ్మకవిది | .. | 0 | 3 |
| కాళహస్తిశతకము, 'సాంబశివామహాప్రభో' | ... | 0 | 2 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| జానకీపరిశతకము, శ్రీకామేశముపంతులు | ... | 0 | 2 |
| చిత్తబోధశతకము, తాత్పర్యసహితము | ... | 0 | 3 |
| అంబరీషోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| భోగినీదండకము, బమ్మెర. పోతరాజప్రణీతము | ... | 0 | 1 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి | ... | 0 | 8 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు | ... | 0 | 8 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది | ... | 0 | 5 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 2 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు | ... | 1 | 4 |
| నలచరిత్ర, ద్విపద | ... | 0 | 14 |
| యజుర్వేదకథాసంగ్రహము | . | 0 | 8 |
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీశతఘంటము, వేంకటరంగశాస్త్రికృతము | ... | 6 | 4 |
| కామధేనువుకథ | ... | 0 | 2 |
| శ్రీవివేకానందవిజయము | ... | 1 | 12 |
| ప్రాచీనదేశచరిత్రలు | ... | 1 | 12 |
| భారతరమణీమణులు | ... | 0 | 12 |
| సంగ్రహరామాయణము, శ్రీశేషాద్రిశర్మకృతము | ... | 0 | 10 |
| సంస్కృతనాటకకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము | ... | 1 | 4 |
| దశకుమారచరిత్రము, ఎనమచింతలసంజీవరాయశాస్త్రికృతము | | 1 | 4 |
| మదనకామరాజుకథలు, చక్కనికూర్పు | ... | 0 | 14 |
| భోజకాళిదాసకథలు 1-వ భాగము | ... | 0 | 12 |
| శ్రీమహాభక్తవిజయము | ... | 4 | 0 |

| | | | |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | అ. |
| దక్కనుపూర్వకథలు, శ్రీ సీతారామశాస్త్రికృతము | .. | 1 | 8 |
| శ్రీ గోక్లేగారి ఉపన్యాసములు | ... | 0 | 2 |
| సూరతుకాంగ్రెస్సు ఉపన్యాసములు | ... | 0 | 2 |
| శ్రీ లాలాలాజ్ పతిరాయిజీవితము | ... | 0 | 2 |
| రామకృష్ణపరమహంసచరిత్రము, ప్రతిమతో | ... | 0 | 2 |
| బాలగంగాధరతిలకుగారిచరిత్రము, ప్రతిమతో | ... | 0 | 4 |
| శ్రీ గోపాలకృష్ణగోక్లేజీవితము ,, | ... | 0 | 2 |
| శ్రీ మహాదేవగోవిందరానడేజీవితము ,, | ... | 0 | 2 |
| శివాజీచరిత్ర | ... | 0 | 8 |
| శ్రీ రామానుజాచార్య చరిత్ర | ... | 0 | 2 |
| స్వామిరామతీర్థజీవితము | ... | 0 | 2 |
| శాలివాహనచరిత్ర | ... | 0 | 3 |
| శ్రీ బుద్ధచరిత్రము | ... | 0 | 4 |
| అనిబిసెంటుచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 4 |
| శ్రీ శంకరాచార్యచరిత్ర ,, | ... | 0 | 3 |
| శ్రీ వేమనయోగిజీవితము | ... | 0 | 2 |
| దాదాబాయినౌరోజీచరిత్ర | .. | 0 | 2 |
| శ్రీ కరంచంద్ గాంధిజీవితము | ... | 0 | 2 |
| శ్రీ గోక్లేగారిజీవితము | | 0 | 2 |
| వివేకానందస్వామిజీవితము | ... | 0 | 2 |
| శ్రీ కృష్ణదేవరాయచరిత్ర | ... | 0 | 3 |
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు | ... | 0 | 2 |
| ఈసబునీతికథలు, క్రొత్తకూర్పు, 1వ భాగము | .. | 0 | 6 |
| డిటో 2వ భాగము | ... | 0 | 8 |
| సీతారామము, తల్లాప్రగడ, సూర్యనారాయణరావు | ... | 1 | 4 |

రాజర్షి, శ్రీరవీంద్రనాథ ఠాకూర్ గారి బంగాళీ నవలకు తెనుఁగు. ఇట్టినవల ఈనాఁటికప్పు కాలేదనియే చెప్పవచ్చును అత్యద్భుత మైనపీఠిక, శ్రీ ఠాకూరు గారి జీవితము యిందున్నవి. ... 0 14

సత్యసేనవిజయము, శ్రీ కో. అనంతాచార్యకృతము ... 0 4

అరేబియన్ నైట్సు కథలు, చక్కని కూర్పు ... 1 4

లార్డు క్లైవు జీవితము ... 0 3

శ్రీ గురుజాడ, శ్రీ రామమూర్తి గారి ఆంధ్ర కవిజీవితములు ... 2 0

సోదరి నివేదిత జీవితము ... 0 2

రేచుక్క పగటిచుక్క కథలు ... 0 3

మర్యాదరామన్న కథలు ... 0 2

షేక్స్పియర్ నాటకకథలు ... 1 8

తారాబాయి, చక్కని నవల, కొత్తకూర్పు ... 0 12

ఆనందమఠ, నవల, నూతనముద్రితము ... 0 12

దుర్గేశనందని, నవల ... 0 8

ఐవన్హో, నవల, కొత్తకూర్పు ... 0 8

మదాలస ,, ... 0 10

సుజనరంజని ,, ... 0 8

మనోహరి, నవల, టి. యస్. రామశాస్త్రి గారిది ... 0 12

పుష్పావతి ,, (అచ్చగుచున్నది.)

వీరబాల, నవల ... 0 8

ఉన్మాదిని ,, ... 0 4

రాధారాణి ,, ... 0 4

లీల ,, ... 0 4

రోషినార, చరిత్ర విషయకమగు నవల ... 0 12

టిప్పుసుల్తాను ... 1 4

భోజునికథలు ... 0 8

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| విక్రమార్కునికథలు | ... | 0 | 6 |
| బేతాళునికథలు | ... | 0 | 6 |
| పరమానందశిష్యులకథలు | ... | 0 | 8 |
| వైద్యులకథలు | ... | 0 | 4 |
| తాతాచార్యులకథలు | .. | 0 | 6 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | 4 |
| అయిగురుదొంగలకథ | ... | 0 | 6 |
| వాసుదేవమననము, సవచనము, మంచిఅచ్చు | ... | 0 | 10 |
| బాలవ్యాకరణము, చిన్నయసూరిగారిది | ... | 0 | 12 |
| నేరములుచేయుజాతులచరిత్రలు, ప్రతిమలతో | ... | 1 | 0 |
| శబ్దార్థచంద్రిక. శ్రీమహాకాళిసుబ్బారాయకృత ఆంధ్రనిఘంటువు | | 3 | 12 |
| ఆంధ్రకన్నడబాలశిక్ష | ... | 0 | 3 |
| హిందీ ఇంగ్లీషు బాలశిక్ష | ... | 0 | 4 |
| సంస్కృత ఇంద్లీషు బాలశిక్ష | ... | 0 | 4 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక | ... | 0 | 4 |
| ప్రౌఢవ్యాకరణము | ... | 0 | 12 |
| అద్వైతసంగ్రహము | ... | 0 | 2 |
| క్షేత్రయపదములు, చక్కనికూర్పు | ... | 0 | 14 |
| నీలగిరిపాటలు, శ్రీగురుజాడ అప్పారాయకృతము | ... | 0 | 6 |
| అధ్యాత్మరామాయణకీర్తనలు, చక్కనిప్రతి చిన్నసైజు | ... | 0 | 8 |
| రామదాసుచరిత్ర, చక్కనికూర్పు, మంచికాగితములు, ఇందు శ్రీరామదాసుగారి ప్రతిమకూడకలదు | ... | 0 | 12 |

ఇవి మొదలగు సంస్కృతాంధ్రగ్రంథములు అనేకములు మాయొద్ద దొరకును.